ఆంధ్ర చంద్రికా గ్రంథమాల - ౨

# తెలంగాణా ఆంధ్రోద్యమము

(మొదటి భాగము)

గ్రంథకర్త:—

మాడపాటి హనుమంతరావు

నాల్గవ ముద్రణము



వెల

చందాదారులకు రు. ౧—౮—౦

ఇతరులకు రు. ౨—౦—౦

తెలుగు విశ్వవిద్యాలయ ఆంధ్రోద్యమము

నకు

సంఘీభావము, సేవాసక్తి, కార్యదీక్షతో

 కట్టి పునాది నేర్పరచిన

# సూర్యాపేట వర్తకసంఘము

వారికి

సూర్యాపేటలో

మహాత్మా

గాంధీపార్కు, గాంధీవిగ్రహ ఆవిష్కరణ

సందర్భమున

౩౦ వ జనవరి ౧౯౪౯ నాడు

ఈ పుస్తకము అంకితము.

రా జ పో ష కు లు:—

శ్రీ రాజా రామదేవరావు బహద్దరుగారు.

శ్రీ రాజా నాయని వేంకటరంగారావు బహద్దరుగారు.

శ్రీ కొండా వేంకటరంగారెడ్డిగారు.

శ్రీ వా ణీ ము ద్రా ల య ము

సు ల్తా న్ బ జా రు,

హైదరాబాద్—దక్కన్.

# విషయసూచిక.



# పీఠిక

ఆంధ్రచంద్రికా గ్రంథమాలలో రెండవకుసుమముగా "తెలంగాణా ఆంధ్రోద్యమము" అను పుస్తకముయొక్క మొదటిభాగము ప్రకటించుటకు మిగుల సంతసించుచున్నాము. ఈ గ్రంథముయొక్క యోగ్యతనుగూర్చి విశేషవ్యాఖ్యానములనవసరము. గ్రంథకర్త జగమెరిగినవాడు. విషయము భావిచరిత్రకారులకమూల్యమయినట్టిది. బహుళముఖ ప్రచారితమయి, ఆంధ్రుల మేల్కొలిపిన యదార్థకథన మిందువర్ణితమయినది. ఇందు వర్ణితమైన ఆంధ్రులకార్యశూరత్వమును జూచి మహారాష్ట్రులు, కర్ణాటకులు ముగ్ధులయిఆంధ్రులననుకరించినచో, ఆంధ్రోద్యమముయొక్క ఘనత వెల్లడికాగలదు. అంతరాయములను గణింపక, కష్టనిష్ఠురములకు తలయొగ్గి, తదేక దీక్షతో ఉద్యమమును కొనసాగించిన ఆంధ్రనాయకుల ప్రతిభావిశేషములు ప్రశంసనీయములుగదా! ప్రజాసేవకతత్పరులయి, వంద్యులయిన మహనీయుల పటములు పెక్కు సంపాదించి గ్రంథము నలంకరింప జేసినాము.

ఈ గ్రంథమునకగుముద్రణాదివ్యయములు శ్రీ సూర్యాపేట వర్తకసంఘమువారు భరించి మాతో సహకరించినందులకు వారికి ధన్యవాదములు సమర్పించుకొనుచున్నాము. శ్రీ సూర్యాపేట వర్తకసంఘమువారి ఆంధ్రచరిత్రాభిమానము, ఆంధ్రభాషాభిమానము అనుకరణీయము.

హైదరాబాదు
1–2–1949

ఆదిరాజు వీరభద్రరావు,
సంపాదకుడు.

## రెండవ ముద్రణమునకు

### పీఠిక

రెండుమాసములు గడచువరకే, ఈగ్రంథముయొక్క పునర్ముద్రణము అవసరమగుటకు కారణములు రెండు:—

(౧) ఆంధ్రసారస్వతపరిషత్తు (హైదరాబాదు) కార్యకర్తలు మాధ్యమిక పరీక్షకు దీనిని పాఠ్యగ్రంథముగా నిర్ణయించుట.

(౨) ఆంధ్రసోదరుల యభిమానము.

కనుక వారికి మేముకృతజ్ఞులము, తమపనినితొందరగా నెరవేర్చిన శ్రీవాణీముద్రణాలయము వారు ప్రశంసాపాత్రులు.

## మూడవ ముద్రణమునకు

### పీఠిక

మరల త్వరలోనే ఈపుస్తకము మూడవ ముద్రణము పొందుభాగ్యము గాంచినది. ఇందునకు ఆంధ్రవాచక ప్రపంచమునకు కృతజ్ఞతా వందనములర్పించు చున్నాము. త్వరగా పని నెరవేర్చిన శ్రీపద్మశాలి ముద్రణాలయమువారు ప్రశంసాపాత్రులు. ఈముద్రణమున ఆంధ్రదేశపటము, సూర్యాపేట వర్తకసంఘమువారిపటము చేర్పబడినవి.

## నాల్గవ ముద్రణమునకు

### పీఠిక

రెండుమాసములు కాగానే నాల్గవముద్రణమవసరమైనది. సత్వరముగా దీనినచ్చువేయించి యిచ్చిన వాణీముద్రణాలయాధికారి శ్రీ నట్టె అప్పారావుగారు స్తవనీయులు.

౫౮ ముసల్లంజంగ్ బాగ్,
మలక్ పేట, హైదరాబాదు.
౨౨—౮—౧౯౪౯.

ఆదిరాజు వీరభద్రరావు
సంపాదకుడు

## తొలి పలుకు

తెలంగాణమునందు, నేటికి ఇరువదియేడేండ్ల క్రింద, ప్రారంభమైయుండిన ఆంధ్రోద్యమముయొక్క మొదటిదశా వివరములు—ఎనిమిది సంవత్సరముల కార్యములు— ఈపుస్తకములో ప్రకటించ యత్నించితిని. దీనిలో యదార్థములగు సంగతులు వ్రాయబడినవేకాని అతిశయోక్తులతో పనిగొనబడలేదు.

## సాధనములు

ఈపుస్తకరచనములో ఎక్కువగా ఉపయోగపడినసాధనములు:— (౧) నీలగిరి పత్రిక (నల్లగొండ) (౨) తెనుగు పత్రిక (ఇనుగుర్తి) (౩) గోలకొండపత్రిక (హైదరాబాదు) వీని ప్రాంతసంపుటములు (౪) ఆంధ్రజన కేంద్రసంఘముయొక్క కవిలెలు. అనేక సంగతులు గ్రంథకర్త జ్ఞాపకముపైనను అనుభవములపైనను ఆధారపడియున్నవి.

## పటములు

ఆంధ్రోద్యమము యొక్క మొదటిదశలో పనిచేసిన అనేక మహాశయులు, ఉద్యమముయొక్క రెండవదశలో అత్యున్నతస్థానము నధిరోహించి, ఉద్యమ చరిత్రను కాంతివంతముగా నొనర్చినవారుకలరు. అట్టివారిపటములు, యోగ్యమగువిధమున, రెండవభాగమున రాగలవు. ఈ మొదటి భాగమున, తదితర మహాశయుల పటములు సాధ్యమైనన్ని సంగ్రి

# తెలంగాణా ఆంధ్రోద్యమము

## ౧

### ప్రాథమికాంశములు.

"నిజాంరాష్ట్రము" అని మనము వ్యవహరించుచున్న భూభాగము హైదరాబాదు రాజ్యము అనునది. ఈ రాజ్యమును క్రీ. శ. ౧౭౨౪ నుండి పాలించుచున్న ఆసఫ్‌జాహి వంశపు రాజులకు "నిజాముల్ ముల్క్" అను బిరుదు మొదటినుండియు వచ్చుచున్నందున ఇచ్చటి రాజునకు సంగ్రహముగ "నిజాము" అను శబ్దము వర్తించుచున్నది. దీనిననుసరించియే యీ రాజ్యమునకు "నిజాంరాష్ట్ర"మను పేరు వాడుకలోనికి వచ్చినది. ప్రజల మాతృభాషలనుబట్టి ఈ రాజ్యము మూడు భాగములుగా నేర్పడినది. (౧)ఆంధ్రప్రాంతము:-అనగా తెలుగువారు నివసించునది. (౨) మహారాష్ట్రప్రాంతము:-అనగా మహారాష్ట్రభాష మాట్లాడువారుండునది. (౩)కర్ణాటక ప్రాంతము:-అనగా కన్నడభాషవారుండునది. ఈ మూడు ప్రాంతములను ఇచ్చటివారు క్రమముగా (౧) తెలంగాణము (౨) మహారాట్వాడీ (౩) కర్నాటకము అను పేళ్ళతో బిలుతురు. వీనిలోని "తెలంగాణము" అనునది ఆంధ్రప్రాంతము కనుక "నిజాంరాష్ట్రాంధ్ర దేశము" అనగా హైదరాబాదు రాజ్యములోని తెలుగుదేశమని వ్యవహారము

లోనికి వచ్చినది కావున, నిజాంరాష్ట్రపు ఆంధ్రోద్యమమనగా హైదరాబాదు రాజ్యములోని తెలుగువారి యభ్యుదయము నకైసాగుచున్న ఉద్యమమనియు, భారతదేశములోని యితర ప్రాంతములందున్న యాంధ్రుల వివిధములగు నుద్యమములకు భిన్నమైనదనియు గ్రహించవలసియుండును. ఇట్టి యుద్యమము, ౮-౨-౧౩౩౧ ఫ (౧౨-౧౧-౧౯౨౨)నాడు ఆరంభమైనదను నంశము జ్ఞప్తియం దుంచుకొనదగినది.

†ఇప్పటి "నిజాంరాష్ట్రము" వింధ్యపర్వతములకు దక్షిణమున నున్న దక్కనుపీఠభూమిపైన విశాలప్రదేశము నాక్రమించి యున్నది. దీని వైశాల్యము, ౮౨ వేల ౬౯౮ చదరపుమైళ్లు. అనగా ఇంగ్లాండు, స్కాట్లండు అను రెంటి వైశాల్యపు మొత్తమును మించుచున్నది. ఈ రాష్ట్రములోని పదునారు జిల్లాలు;

† దీనిలో బరారు ప్రాంతము చేరదు. దానినికూడ చేర్చుకొనినచో ౧౭ వేల ౭౧౦ చదరపుమైళ్ళ వైశాల్యము అధికమగును. మహాఘనత వహించిన నిజాముప్రభువు బరారునకుగూడ ఏలికగా నంగీకరింపబడి యున్నాడు (౨౦ అక్టోబరు ౧౯౩౬ నాటి సంధిపత్రము) ఇచ్చటి యువరాజుగార "బరారు రాజు కుమారుడు" అనియు యువరాజుగారి భార్య "బరారు రా

నాల్గు సూబాలుగా భాగింపబడియున్నవి. అవి (౧) వరంగలు సూబా (౨) మెదకు సూబా (౩) గుల్బర్గా సూబా (౪) అవురంగాబాదు సూబాయను పేర్లు కలిగియున్నవి. ఈ నాల్గింటిలో మొదటి రెండుసూబాలు, అనగా వానిలో నిమిడియున్న ఎనిమిది జిల్లాలు, * ప్రభుత్వమువారి పత్రవ్యవహారమున "తెలంగాణము"గా వ్యవహరించబడుచున్నవి. ఈ తెలంగాణములోనే రాజధానీ నగరమగు హైదరాబాదు కలదు. తెలంగాణపు మొత్తము వైశాల్యము ౪౧ వేల ౫౦౨ చదరపుమైళ్లు- ఇది రాష్ట్రపు మొత్తము వైశాల్యములో సగమును మించుచున్నది. యదార్థము విచారించినచో, నిజాంరాష్ట్రములోని మహారాష్ట్ర కర్ణాటక జిల్లాలని ప్రభుత్వ వ్యవహారమునందున్న వానిలోని కొన్ని భాగములుకూడ ఆంధ్రప్రాంతమున చేరదగియున్నవి.

కుమారిత" గాను బిరుదములతో పేర్కొనబడుచున్నారు. అయినను బరార పరిపాలనము మధ్యపరగణాల గవర్నరుక్రిందనే యున్నది. పూర్వము ఉత్తరసర్కారులును, దత్తమండలములును నిజాము ప్రభువు పాలనమునకు లోబడియుండెను. కాని ఆప్రాంతమంతయు ఇప్పుడు మద్రాసు రాధానికి చెందియున్నది.

* బాగాతు జిల్లా తెలంగాణములోనిదే కనుక వీనిసంఖ్య ౯ అయిన

♦ ఈ యంశములను దృష్టియం దుంచుకొని చూచినచో ఆంధ్ర ప్రాంతము నిజాం రాష్ట్రములో ప్రధాన స్థానము నాక్రమించి యున్న దనుట నిర్వివాదాంశము!

ఆంధ్రోద్యమ మారంభమగుటకు పూర్వము నిజాం రాష్ట్రాంధ్ర దేశములోని పరిస్థితు లెట్లుండునో తెలియుటకై ఈ ప్రకరణము ప్రత్యేకముగా నుద్దేశింపబడియున్నది. కనుక ఇచ్చట మే మిచ్చు అంకెలును, సంగతులును నేటికి ఇరువది యైదు సంవత్సరములకంటె పూర్వపువని గ్రహించగోరెదము.

“రాజ్యములోని...౮ జిల్లాలు, వరంగలు, కరీంనగరం, ఆదిలాబాదు, నిజామాబాదు, మెదకు, నల్లగొండ, మహబూబు నగరము, అత్రాఫుబల్దా అనునవి తెలంగాణమువి. ౧౯౧౧సం లో జరిగిన జనపరిగణనమునుబట్టి తెలుగుజిల్లాల మొత్తము జన సంఖ్య ౬౭ లక్షల ౨౪ వేల ౬౯౪ (రాష్ట్రపు మొత్తము జన సంఖ్య ౧,౩౩,౭౪,౬౭౬) ..తెలుగుజిల్లాలను పశ్చిమదిశనఅంటి యున్న...జిల్లాలగు రాయచూరు, గుల్బర్గా, బీదరులలోకూడ

---

♦ నిజాంరాష్ట్రములోని ఆంధ్రప్రాంతము నిజముగా నెంతయున్నదో విచారణసల్పి నివేదిక సమర్పింపవలయునని ఐదవ నిజాంరాష్ట్రాంధ్ర మహా సభ (షాదునగరము) తీర్మానించియుండెను. కాని ఈ పని కొన్ని కారణముల వలన ఇంకను సాగ లేదని తెలియుచున్నది.

తెలుగు వారున్నారు. వీరిసంఖ్య ౮ లక్షల ౭ వేల ౫౮౭...నిజాం రాష్ట్రమునందు తెలుగుభాష మాతృభాషగాగలవారి మొత్తము సంఖ్య ౬౩ లక్షల ౬౭ వేల ౫౭౮. ♦రాజ్యమున మొత్తము మీద నున్న ౧౮ వేల చదరపుమైళ్ళ యరణ్యములలో, ౧౬ వేల చదరపుమైళ్ళ యరణ్యము తెలంగాణములోనిదే, రాజధాని యగు హైదరాబాదు తెలుగుదేశములోనే చేరియున్నది... రాజ్యములోని ముఖ్య సంస్థానములగు పాలవంచ, ఆత్మకూరు,

---

♦ ఇందలి యంకెలు తరువాత జరిగిన, ౧౯౨౧, ౧౯౩౧, ౧౯౪౧ లోని జన పరిగణనములందు మారినవి. పాఠకుల యుపయోగార్థము వాని నీ క్రింద జూపెదము:—

| సం॥ | రాష్ట్ర జనసంఖ్య |
|---|---|
| ౧౯౨౧ | ౧,౨౪,౭౧,౭౭౦ |
| ౧౯౩౧ | ౧,౪౪,౩౬,౧౪౮ |
| ౧౯౪౧ | ౧,౬౩,౩౮,౫౩౪ |

| తెలంగాణపు జనసంఖ్య | రాజ్యమున ఆంధ్రము మాట్లాడువారి సం॥ |
|---|---|
| ౬౪,౧౯,౨౯౮ | ౬౦,౧౫,౧౭౪ |
| ౭౫,౫౪,౫౯౮ | ౯౯,౭౨,౫౩౪ |
| ౮౪,౩౨,౬౦౭ | ౭౫,౨౯,౨౨౯ |

జటప్రోలు, గద్వాల, వనపర్తి మున్నగునవి తెలుగువే. ♦గడచిన ౧౦ సంవత్సరముల (౧౯౦౧-౧౯౧౦) కాలములో పట్టణములుగా మారిన ౯ ప్రదేశములలో ౭ తెలుగుజిల్లాలలోనివే.. అనేక సంవత్సరములనుండి మహారాష్ట్రాడీ కర్ణాటకములు ప్లేగుజాడ్యము వలన పీడింపబడుచున్నవి. వానిలోని కొన్ని జిల్లాలందు వర్షలోపము వలన తరచుగా క్షామములు సంభవించుచుండును. కాని తెలుగుజిల్లాలలో నేటివరకు ప్లేగు రాలేదు. ౧౯౧౧ సంవత్సరమున హైదరాబాదు పట్టణమున నీ జాడ్యము పొడచూపెను. కాని అది మరలవచ్చియుండలేదు. పై సంగతులనుబట్టి నిజాము రాజ్యములోని తెలుగువారు చాల సుఖులై వృద్ధి మార్గోన్ముఖులై యున్నారని తోచును కాని ..ఇట్టి అభిప్రాయమునకు మనము రాకూడదు."

"నిజాం రాష్ట్రమున జరుగుచున్న పరిపాలనా సంస్కరణలలో... తెలుగువారు రాజ్యాంగమునందు ఏమాత్రమును గొప్ప స్థితికి వచ్చినట్లు కానరాదు. కొన్ని సంవత్సరములక్రింద హైకోర్టు జడ్జి పదవిని ఆకస్మికముగా బొందిన యొక నాయుడుగారిని వదలివేసితిమేని హైకోర్టుజడ్జీపదవికి వచ్చిన తెలుగువాడు లేనే

---

♦వీనిలో, దోమకొండ, సిరిసేపల్లి, గోపాలపేట, రాజాపేట అను సంస్థానములుకూడ చేర్చదగినవై యుండెను.

లేదు. వైద్యశాఖయందిప్పుడు పనిచేయుచున్న ఒకరిద్దరిని లెక్క లోనికి దీసికొననిపక్షమున, ఉన్నతోద్యోగములందున్న తెను గువారు లేనేలేరని నిస్సంశయముగా జెప్పవచ్చును. ౧౯౧౯లో హైదరాబాదునందు శాసననిర్మాణసభ యొకటిస్థాపింపబడినది. అప్పటినుండి నేటివరకు ఒక యాంధ్రుడేనియు దానిలో సభ్యు డగు భాగ్యమును పొందలేదు. పలువురు హిందువులు ఈ రాజ్య మున అవ్వలుతాలుకుదారులుగను, సూబేదారులుగను పనిచేసి యున్నారు. కాని ఆంధ్రుడెవ్వడును అట్టిగౌరవమునకు పాత్రుడు కాలేదు. వేయేల? నూరు రూపాయలకు మించిన (నెల) వేత నముగొను తెలుగువారిని మనము వ్రేళ్లపైన లెక్కించవచ్చును. తుదకు, హైదరాబాదు హైకోర్టులో ప్రముఖులుగా పనిచేయు చున్న న్యాయవాదులలో ఆంధ్రు డెవడైన నున్నాడా యని సంశయింపవలసి యున్నది."

"మహారాష్ట్రాడి రైతు వర్తకాభివృద్ధికి సాధనములగు పంటలను పండించుచున్నాడు...కాని తెనుగు రైతు ఇంకను భోజనమున కపసరములగు పంటలను పండించుటతోనే తృప్తి పొందుచున్నాడు. రాజ్యమునగల ౧౫౮ కర్మాగారములలో ౬౫ మాత్రము తెలుగు ప్రాంతములో నున్నవి. వీనిలో ౧౦ హైదరాబాదు పట్టణములోనినే. కర్మశాలల యజమానులు

సాధారణముగా పారసీలో తురకలో అయియుందురు...చర్మపు పనులలోను, నేతపనులలోను ముందంజ వేయువారు సాధారణముగా తురకలే...నాగరకతగలదిగా నెంచబడు హైదరాబాదు పట్టణమున సైతము వందలకొలది మహారాష్ట్ర బ్రాహ్మణులు వర్తకవ్యాపారము సమర్థతతో నిర్వహించుచుండ,...తెలుగు బ్రాహ్మణుడు వర్తకము తనకు అవమానకరమగు వృత్తియని యింకను భావించుచునేయున్నాడు."

"ఈ రాష్ట్రములో హిందువులసంఖ్య నానాటికి క్షీణించుచున్న దనుమాట ఈక్రింది యంకెలవలన తెలియగలదు:-

| సం॥ | పదివేలజనులలో హిందువులసంఖ్య |
|---|---|
| క్రీ శ. ౧౮౮౧ | ౯౦౪౩ |
| ,, ౧౮౯౧ | ౮౯౮౪ |
| ,, ౧౯౦౧ | ౮౯౧౪ |
| ,, ౧౯౧౧ | ౮౬౧౪ |

"ఎనిమిది జిల్లాల వైశాల్యముగల యీ తెలుగుదేశమందు,తుదకు రాజధానీ నగరమందైనను, ఒక బ్రాహ్మసమాజముగాని, ప్రార్థన సమాజముగాని లేదు. హైదరాబాదునందొకటియు, సికిందరాబాదునందొకటియు మొత్తము రెండు

ఆర్యసమాజములు కలవు గాని అవి చేయుపని మిక్కిలి యల్ప
ము. ఆపనియైనను పట్టణముదాటి యవతలికిబోయినట్లుతోచదు.
సంఘ, మత సంస్కారోద్యమములు ఇంకను ఇచ్చటివారి కన్ను
లను విప్పలేదు."

"ఈ రాజ్యమున చదువుకొనినవారి సంఖ్య వేయింటికి
౫౦ మందికంటె మించలేదు. హిందూ మహమ్మదీయులలో
చదువనేర్చినవారి సంఖ్యలను వేరుపరచి చూచిన పక్షమున
ముస్లిములలోనే చదువువచ్చినవా రెక్కువగా గలరనట గాన
వచ్చుచున్నది. తురకలలో చదువువచ్చినవారు వేయింటికి ౯౯
మంది; హిందువులలో అట్టివారు ౪౩ మంది మాత్రమే...
తెలుగుదేశమున మాధ్యమిక పాఠశాలల సంఖ్య ౧౦. ఇక
మహారాష్ట్రజిల్లాలలో నిట్టివి ౨౯ వున్నవి... హైదరాబాదు
లోనికళాశాలయందు నేటివరకును, ఎఫ్.ఏ,బి.ఏ, పరీక్షలలో
గడతేరిన వారిలో, తెలుగువారి సంఖ్య అత్యల్పము. వైద్య
కళాశాలయందును, శిల్పకళాశాలయందును విశేషసంఖ్య
మహారాష్ట్రవిద్యార్థులదే. పారిశ్రామిక విద్యాలయములం
దును తెలుగువారు సామాన్యముగా గానరారు. ఇచ్చటిన్యాయ
శాస్త్రముల బోధించు తరగతిలో సైతము మహారాష్ట్రవారి
సంఖ్య తెలుగువారిసంఖ్యకంటె ఎన్నియో రెట్లుమించియున్నది."

బ్రిటిషు హిందూదేశములోలేని చిక్కొకటి ఈ రాజ్యములవారి నెదుర్కొనుచున్నది. అదేదనః-అచ్చట ఇంగ్లీషు, దానితో దేశభాష, ఈ రెండే కావలసి యున్నవి. ఇచ్చట ఆ రెంటితో బాటు ఉర్దూకూడ వచ్చిననేగాని పనిసాగదు. కనుక ఇచ్చటి విద్యార్థి మాతృభాష నేర్చుకొనుట యందు కొంతకాలమును, ఉర్దూ నభ్యసించుట యందు కొంత కాలమును, ఇంగ్లీషు కొరకు మరికొంతకాలము గడుపవలసి యున్నాడు."

"ఆరంభవిద్య తెలుగున నేర్పు పాఠశాలలు చాలగ్రామములలోనున్నవి. కాని అంతమాత్రమున జనులకు లభించు జ్ఞానము స్వల్పము. మాధ్యమిక పాఠశాలలలో తెలుగు రెండవభాషగా మాత్రము జదువ వీలున్నది. హైదరాబాదు కళాశాలలో తెలుగు బోధించు నేర్పాటులు కలవు. కాని దాని వలన లాభము తక్కువ... ఈ రాజ్యమువారు ఉర్దూనో, పారసీనో రెండవభాషగా దీసికొనగోరుచుందురు. మాధ్యమికవిద్యా పరీక్షలో తెలుగు రెండవభాషగా దీసికొనువారి సంఖ్య దినదినము సన్నగిల్లుచున్నది. ప్రాతపద్ధతిని సంస్కృతమందును ఆంధ్రమునందును కొంత పాండిత్యముగలవారు కొందరు అక్కడక్కడ, ముఖ్యముగా, వరంగల్లు, కరీంనగరము, నల్లగొండ జిల్లాలలో నున్నారు. కాని, వారు... ఏమూలలనో కూర్చుండి యుక్ష

గానములనో, హరికథలనో, శతకములనో వ్రాసికొని బ్రతుకవలసినవారై యున్నారు."

"ఇక ఇచ్చటి తెలుగువారు మాట్లాడుభాషను జూడుడు... ఈ రాజ్యములోని తెలుగుభాషకు, ఉత్తరమునను, కొంతవరకు పశ్చిమమునను మహారాష్ట్రభాషతోను, కొంత పశ్చిమమునను దక్షిణమునను కన్నడభాషతోను సమ్మేళనము కలుగుచున్నది. తక్కిన యన్నిభాగములలోను, అందు ముఖ్యముగా పట్టణములందు, ఉర్దూ భాషాసంపర్కము వీడజాలనిదై యున్నది. ఈ కారణమువలన, పైనచెప్పిన ప్రాంతములవారి యాచారములందువలెనే, వారి భాషయందుకూడ ఎన్నియోమార్పులు వాటిల్లినవి. ఆదిలాబాదు, నిజామాబాదు ప్రాంతములందువసించువారు సంభాషించునప్పుడు మహారాష్ట్రభాషలోని శబ్దములును వాని యపభ్రంశస్వరూపములును తరచుగా వచ్చుచుండును. వారి భాషకు ఉదాహరణము:–*'ఇదేమ్రా మాయ్, రొండు దివ్సలుఆయె. సాళెకుపోవు, ఇదేమి దైవము?...ఏస్గసొండెము ఏద్దిరా?...కాకికు మావుశీ భేటీ కాలేదు". ఇక మహబూబు

* దీనిని సాధారణ భాషలో నిట్లు చెప్పవచ్చును "ఏమిరా నాయనా, రెండుదినము లాయెను. బడికిపోవు. ఇదేమి దురదృష్టము?... ఏనుగు తొండము ఏద్దిరా?... చిన్నాయనకు మేనత్త దర్శనము కాలేదు,

నగరపు తుదిభాగములోను అత్రాపుబల్దాయొక్క పశ్చిమ భాగములోను నివసించువారి భాష కర్ణాటకుల సంపర్కము వలన కన్నడ భాషాశబ్దములతో నిండి యుండును. దీని కుదాహరణ:ము-'*మా నణ్ణపిల్లకు పెసరబేడలు పట్టవు. ధొడ్డపిల్ల బేకైనంత తిన్టది'. ఇక ఉర్దూతోడి కలయికవలన తెలుగు భాషకు కలిగిన దురవస్థ ఇట్టిదని చెప్పుట కష్టము. ఉదాహరణము:-†'ఈ మొకద్దమాలో చలాయించిన కార్రవాయిఅంతా జాలీది. సాహెబు జిల్లా జాయె మౌక్షా కుపోయి, తహకీకాతు చేసి కైఫియతు రాసినాడుగదాకె, ఫరీఖుదావా బిలూకాలు నాజాయజు. ఆయిందా యీతౌర్న కార్రవాయి చేసిన సూరతులో మాఖూలు తదారకు చేయటం కాగలదు. ఫక్తు మర్కుం చందు ౧౬ ఫర్వర్ది సన్ తేరాసౌ బారా ఫసలీ". (ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక:-౨-౪-౧౯౧౪ పుటలు ౧౪౯-౧౫౨)

---

*దీనిని సాధారణమగు తెలుగులో నిట్లుచెప్పగలము:-"మాచిన్న పిల్లలకు పెసరపప్పు ఇష్టము లేదు. పెద్దపిల్ల కావలసినంత తినుంది.

† దీని భావమును ఈ విధముగా ప్రకటించగలము:- "ఈవ్యవహారములో నడచిన చర్య అంతాతప్పు సృష్టి. జిల్లాతాలూకుదారు, ఆ స్థలముకు పోయి విచారణచేసి, నివేదిక వ్రాసినాడు. ఏమనగా: కక్షిదారు చేసిన వాదము పూర్తిగా అక్రమమైనది. ముందు ఈ విధమగుచర్య జరిపిన పక్షమున భాగా శిక్షవిధించటము కాగలదు: తేది ౧౬ ఫర్వర్ది ౧౩౧౨ ఫ.

పైన వర్ణింపబడిన స్థితిగతులు క్రీ.శ. ౧౯౧౮ నాటివేయైనను. నిజాంరాష్ట్రమున ఆంధ్రోద్యమ మారంభమైన ౧౯౨౨ (౧౩౩౧ ఫసలీ)సం॥ లోపల—అనగా ఎనిమిదేండ్ల కాలములో—ఆంధ్రుల పరిస్థితులందు కలిగిన మంచిమార్పులు ఏవియుచెప్పదగినవి లేవు.‡

ఆ కాలమున, రాజధానీనగరమగు హైదరాబాదు పురమున ప్రజాహిత కార్యములం దభిరుచిగలవారందరును మహారాష్ట్రులుగనే యుండిరి. ప్రజలపక్షమున విద్యాసంస్థలను స్థాపించువారు వారే. ఉన్నతవిద్యావిభూషితులగు పురుషులును స్త్రీలును వారిలోనుండియే కానవచ్చుచుండిరి. సభలందును, సమావేశములందును, గణపతిఉత్సవములవంటి సమారంభములందును కర్తృత్వము, యోగ్యతాప్రదర్శనము అంతయు వారిదిగనే యుండినది. తెలుగువారిలో విద్యాధికు డెవడైనను, ఎచ్చటనైనను వెక్కిరించినట్లు కానవచ్చినను, అతనియందు ఉత్సాహముగాని, దేశకార్యతత్పరతగాని మందునకైన గోచరమగుచుండ

---

‡ఈ కాలములోపలనే ౨-౧-౧౩౨౭ ఫసలి (౩-౧౦-౧౯౧౭) నాడు ఉర్దూ ప్రధానభాషగా గల ఉస్మానియా విశ్వవిద్యాలయము స్థాపితమైనది. అది ఆంధ్రుల ఆశయముల నెంతవరకు నెరవేర్చినదో వివరించవలసిన పనిలేదు. అట్టి వివరణమున కిది సందర్భముకూడ కాదు.

లేదు! హైదరాబాదునగరము నిజాంరాష్ట్రాంధ్రప్రాంతములోని దగుటవలనఅది, తననగరమే యని ఆతనికిస్మరణయే యుండలేదు. తన మాతృభాష తెలుగని యాతనికి సాధారణముగా తోచుటయే లేదు! అతని వేషములోను, అతని భాషలోను, సాధారణముగా, ఆంధ్రత్వము వెదుకదగినదై యుండెనని చెప్పినజాలును!

ఈ సందర్భమున, క్రీ.శ. ౧౯౦౧ నుండి నిజాంరాష్ట్రాంధ్రప్రాంతమున అచ్చటచ్చట స్థాపింపబడిన ఆంధ్రగ్రంథాలయముల సేవ ప్రశంసింపదగినది. మన రాజ్యములోని మొట్టమొదటి ఆంధ్రగ్రంథాలయము, శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషానిలయము. ఇది హైదరాబాదు నగరములోని రెసిడెన్సి బజారులో ౧-౯-౧౯౦౧నాడు స్థాపింపబడియుండెను. రెండవది హనుమకొండలోని శ్రీరాజరాజ నరేంద్ర ఆంధ్రభాషానిలయము. (౨౯౧-౧౯౦౪). మూడవది సికింద్రాబాదులోని ఆంధ్రసంవర్ధనీ (౩౦-౯-౧౯౦౫) ‡ఇట్టివే మరికొన్ని తెలుగు జిల్లాలలో అచ్చ

‡మరికొన్ని గ్రంథాలయములు: (౧) సంస్కృత కళాసంవర్ధినీ సికింద్రాబాదు (౩-౮-౧౯౧౩)(౨)మహబూబియా ఆంధ్రభాషానిలయము ఎర్రుపాలెము (వరంగలుజిల్లా) (౧౬-౭-౧౯౧౧)(౩) శ్రీసిద్ధిమల్లేశ్వర గ్రంథాలయము, రేమిడిచర్ల (వరంగల్లుజిల్లా)(౧-౯-౧౯౧౩)(౪)శ్రీఆంధ్ర విజ్ఞాన ప్రకాశినీ గ్రంథనిలయము,సూర్యాపేట, నల్లగొండజిల్లా (౧౯౧౭) (౫) శ్రీ ఆంధ్రసరస్వతీ గ్రంథనిలయము, నల్లగొండ (౧౮-౩-౧౯౧౮)

టచ్చట నెలకొల్పబడి మాతృభాషాప్రసారము చేయుచుండెను. వీనిలో మొదటిది విఖ్యాతులగు మునగాల జమీందారులు, శ్రీ రాజానాయని వేంకట రంగారావుగారిపోషకత్వమున, కీర్తిశేషు లగు కొమర్రాజు వేంకటలక్ష్మణరావు, రావిచెట్టు రంగారావు, ఆదిపూడి సోమనాధరావు, మైలవరము నృసింహశాస్త్రిగార్ల తోడ్పాటుతో స్థాపింపబడినది. శ్రీ రాజాగారి ఇట్టి పోషకత్వమే రెండవ భాషానిలయమునకును, జిల్లాలలోని మరికొన్ని గ్రంథా లయములకును లభించినది. మనరాష్ట్రపు ఆంధ్రోద్యమ మారం భమగువరకు ఇట్టి పుస్తకభాండారములు పదివరకైనను తెలం గాణమున ఆంధ్రభాషాప్రచారమునకై శక్తికొలది పాటుపడు చుండెననియు, వీనిమూలమున నవీనాంధ్రవాఙ్మయము పుస్తక ముల రూపమునను, పత్రికల రూపమునను, తెలంగాణమున వ్యాపించుచు ప్రబోధప్రద మగు చుండెననియు, కీ. శే. మైల వరము నరసింహశాస్త్రిగారు శ్రీ కృష్ణదేవరాయల యాంధ్ర భాషానిలయమున వార్షికోత్సవ సందర్భములందును, శ్రీకృష్ణ

(౬) శ్రీ శబ్దానుశాస నాంధ్ర భాషామందిరము, వరంగలు (౨-౨-౫-౧౯౧౭)
(౭) శ్రీ మదూరి రాఘవులు భాషాకల్పవల్లి, సికింద్రాబాదు (౧౯౨౦)
ఇంకను కొన్ని గ్రంథాలయము లుండిన వక్షమున, మా స్మరణలోవ మునకు చింతిల్లుచున్నాము: అన్యధా భావించవలదని మనవి.

దేవరాయల జన్మోత్సవములందును రచించి చదువుచుండిన రస పరిప్లుతములగు పద్యములు అప్పటి నవయువకులందు, మాతృ భాషాభిమానమును పురికొల్పుచుండెననియు మాకు అనుభవ సిద్ధము. ఇట్టి పుస్తకభాండారముల సేవవలన ౧౩౩౧ ఫ. (౧౯౨౨)లో నారంభమైన ఆంధ్రోద్యమము సత్వరముగా వ్యాపించుటకు మార్గమేర్పడినదని మేము భావించుచున్నాము.

నిజాంరాష్ట్రాంధ్రప్రాంతమున పైన చెప్పినవిధమున గ్రంథాలయోద్యమమును స్థాపించిన గౌరవము శ్రీకృష్ణదేవ రాయల యాంధ్రభాషానిలయ స్థాపకులకను—ముఖ్యముగ తత్స్థాపకులగు శ్రీ మునగాల రాజాగారికిని-చెందవలసియున్నది.

ఈ ప్రకరణమున, కొంత దీర్ఘముగ వివరింపబడిన నిజాంరాష్ట్రాంధ్రుల పరిస్థితులు, కొందరి మానసములను ఆం దోళన పరచి, ఈ రాష్ట్ర స్థితిగతులకు తగిన విధమున ఆంధ్రో ద్యమమును ప్రారంభింప వారిని పురికొల్పినది. ఇట్టియాందోళ నమును కార్యరూపము నవలంబింపజేసిన యొకసంఘటనమును వివరింపక యూరకుండ జాలము.

౭,౮ దై ౧౩౩౧ఫ. (౧౧, ౧౨నవంబరు ౧౯౨౨) తేదు లలో హైదరాబాదు పట్టణమున నిజాంరాష్ట్ర సంఘసంస్కార

మహాసభ సమావేశ మయ్యెను. దానికి విఖ్యాతచరిత్రుడును, మహిళా విశ్వవిద్యాలయ స్థాపకుడునగు కర్వేపండితుడు అగ్రాసనాధిపత్యము వహించెను. వారియధ్యక్షోపన్యాసములో చాలభాగము మహారాష్ట్రములోను, కొంత ఇంగ్లీషులోను ఉండెను. ఇది ఆంధ్రులగు కొందరికి మనస్తాపకారణ మైనది. రెండుదినములు అనేక తీర్మానములు అంగీకరింపబడినవి. వాని పైనజరిగిన ఉపన్యాసములు, ఇంగ్లీషులో ను, ఉర్దూలోను, మహారాష్ట్రములోను ఉండెను. నగరములోనిసుప్రసిద్ధ ఆంధ్రన్యాయవాది శ్రీ ఆలంపల్లి వేంకటరామారావుగారు, ఒక తీర్మానము పైన తెనుగులో నుపన్యసించ నారంభించగా, సభాసదులు— ముఖ్యముగా మహారాష్ట్రులు—విననొల్లక చప్పట్లుచరచి ఉపన్యాసకుడు ప్రసంగమునాపి కూర్చుండునట్లు చేసిరి! తెలంగాణములోని ప్రధాననగరమున, ఆంధ్రులు బహుళసంఖ్యాకులుగానున్న రాజధానీనగరమున, ఆంధ్రభాషలోనుపన్యాసముజరుగుట అసంభవమగుట సభలోనున్న పలువురాంధ్రులను దుఃఖితులజేసెను. సభాకార్యములు పూర్తికాకముందే వారు వెడలిపోయిరి!

ఆనాటి రాత్రియే ఆంధ్రోద్యమము నారంభించుసంకల్పముతో ఆంధ్రజనసంఘ మనునది స్థాపింపబడెను!

# తెలంగాణా ఆంధ్రోద్యమము.

## ౨

### ఉద్యమారంభము.

నిజాంరాష్ట్రములోని ఆంధ్రోద్యమమునకు అంకురార్పణము, హైదరాబాదునగరమున ఆంధ్రజనసంఘమును స్థాపించుటతో జరిగినదని చెప్పవచ్చును. ఈ పని దుర్మతినామసంవత్సర కార్తికశుద్ధ ద్వాదశి (౮ దై ౧౩౩౧ ఫ. ౧౨-౧౧-౧౯౨౧) నాడు రాత్రి ౮ గంటలవేళ త్రూపుబజారులో, ఇప్పుడు కీర్తిశేషులైన * టేకుమాల రంగారావు, హైకోర్టువకీలుగారి భవనమున ౧౧గురు ఆంధ్రుల సమావేశముతో జరిగినది. అప్పుడు

---

*(౧) కీ. శే. టేకుమాల రంగారావుగారు, త్రూపుబజారు. (౨) మిట్టా లక్ష్మీనరసయ్యగారు, వకీలు, పచ్చబావి. (౩) ఆదిరాజు వీరభద్రరావుగారు, అకులబజారు, సికిందరాబాదు. (౪) కీ. శే. నడింపల్లి జానకిరామయ్యగారు, రెసిడెన్సిబజారు, (౫) మందుముల నరసింగరావుగారు, కిషన్‌గంజు. (౬) బూర్గుల రామకృష్ణారావుగారు, బి. ఎ. కిషన్‌గంజు. (౭) కొమ్మవరపు సుబ్బారావుగారు, రెసిడెన్సిబజారు, (౮) బూర్గుల నరసింగరావుగారు, కిషన్‌గంజు. (౯) కీ. శే. డా॥ పందిటి రామస్వామినాయుడుగారు, త్రూపుబజారు. (౧౦) బోయినేపల్లి వేంకటరామారావుగారు, గౌలిగూడెము. (౧౧) మాడపాటి హనుమంతరావుగారు, వకీలు, త్రూపుబజారు.

‡నాలుగు తాత్కాలిక నియమములు మాత్రము అంగీకరించబడి నవి. సంవత్సరమునకు కనీసము ఒక రూపాయ చందానిచ్చు వారు ఈ యాంధ్రజన సంఘమునకు సభ్యులుగా నెంచబడెదర నియు, దైమాసాంతమువరకు తగినంతమంది సభ్యులను చేర్చు కొనిన తరువాత, సభ్యుల యభిప్రాయానుసారము నియమముల నిర్మించుకొనవలయుననియు, ఎన్నికలు జరుగువరకు పనిచేయు టకై శ్రీ టేకుమాల రంగరావుగారు కార్యదర్శిగా వ్యవహ రించ వలయుననియు ఆసమావేశమున తీర్మానింపబడినది.

త్వరలోనే ౧౦౦ గురు సభాసదులు సంఘమున చేరిరి. తరువాత, ౨౩ ఫర్వర్ది ౧౩౩౧ ఫ. (౨౮-౨-౧౯౨౨) నాడు సాయంత్రము రెడ్డివిద్యాలయ మందిరమున శ్రీకొండా వేంకట రంగారెడ్డిగారి యధ్యక్షతన, మహాజనసభ జరిగినది. కార్యకర్త లలో నొకరు, సంఘస్థాపనము, దాని యుద్దేశము, తాత్కాలిక నియమములు, అప్పటివరకు జరిగినపని మొదలగువానిని సభ వారికి నివేదించిరి. చిత్తునియమావళిని చర్చించి నాల్గు నియమ

‡ ఈ నియమములలో నొకటి ఇట్లుండెను:—

"పుట్టుక వలనగాని స్థిరనివాసము వలనగాని హైదరాబాదు రాజ్యములోని యాంధ్రు లగువారందరును ఈ సభలో చేరవచ్చును. ఇట్టి వారి వయస్సు ౧౮ సంవత్సరములకు మించి యుండవలెను."

ములు అంగీకరింప బడినవి. తరువాత, ఇట్టి మహాజన సభలు రెండుమారులు, ౧౩ అర్ది బెహెష్తు ౧౩౩౧ ఫ. (౧౭-౩-౧౯౨౨) నాడును, ౩౧ అర్ది బెహెష్తు ౧౩౩౧ ఫ. (౪-౪-౧౯౨౨) నాడును శ్రీ రెడ్డిగారి యధ్వర్యముననే సమావేశమై, నియమావళిని పూర్తిగా నంగీకరించెను. తుది దినమున, నియమావళిలోని తొమ్మిదవసూత్రము ననుసరించి కార్యనిర్వాహక వర్గము ఎన్నుకొనబడినది †. నియమముల నన్నిటిని ఇచట చూపుట గ్రంథ విస్తరమగును. కనుక, ఉద్యమస్థాపకుల యుద్దేశముల పరిమితిని సూచించగల మొదటి నాల్గు నియమములను మాత్రము ఈ క్రింద ఉద్ధృతము చేయుటచాలుననితోచినది. అవియిట్లున్నవి:-

---

†(౧)ఆర్. రాజగోపాలరెడ్డిగారు, బారిస్టరు(అధ్యక్షుడు) (౨)మాడపాటి హనుమంత రావుగారు, (కార్యదర్శి) (౩)మందుముల నరసింగరావుగారు, (సహాయకార్యదర్శి) ఇతర పాలక సభ్యులు (౪) కొండా వేంకటరంగా రెడ్డిగారు, హై. వ. (౫) (కీ. శే.) టేకుమాల రంగరావుగారు, హై. వ. (౬) పాపిరెడ్డిగారు. హై. వ. (౭) పాలపర్తి సత్యనారాయణగారు. (౮) కీ. శే. వడిపల్లి జానకిరామయ్యగారు, (౯) ఇ. శేషాచార్యులుగారు, హై. వ. (౧౦) (కీ. శే.) డాక్టరు పండిటి రామస్వామినాయుడుగారు (౧౧)ఆదిరాజు వీరభద్రరావుగారు. (౧౨)(కీ. శే.) రాజారంగారావుగారు (౧౩) కైలాంబుల శాంతిరెడ్డిగారు. హై. వ. (౧౪) ముష్త్యాల సాంబయ్యగారు. వర్తకుడు, సికిందాబాదు. (౧౫) [కీ. శే.] ఆల్వారి లక్ష్మీనారాయణ గారు.



కీ. శే. టేకుమాల రంగారావుగారు



ఆర్. గోపాలరెడ్డిగారు



శ్రీ భువనగిరి లక్ష్మయ్యగారు.
(సూర్యాపేట వర్తకులు)



శ్రీ భువనగిరి శంబయ్యగారు.
(సూర్యాపేట వర్తకసంఘ కార్యదర్శి)

"(౧) ఈ సంఘమునకు "నిజాంరాష్ట్రాంధ్ర జన సంఘము" అని పేరు.

(౨) నిజాంరాష్ట్రము నందలి యాంధ్రుల యందు పరస్పర సహానుభూతి కలిగించి వారి యభివృద్ధికై ప్రయత్నించుట ఈ సంఘముయొక్క ఉద్దేశము.

(౩) ఈ రాజ్యములోని ఆంధ్రులకొరకు, సంఘములను, సంస్థలను స్థాపించుట, ఉన్న వానికిసహాయము చేయుట, ఉపన్యాస సభలను సమావేశ పరచుట మున్నగు కార్యముల వలన పై ఉద్దేశము నెరవేర్ప బడును.

(౪) ఈ రాజ్యములోని ప్రతి ఆంధ్రవ్యక్తియు, పదునెనిమిది సంవత్సరములకంటె మించినవయస్సుకలిగి, చదువను, వ్రాయను నేర్చియున్నచో, ఈ సంఘమున సభాసదుడు కావచ్చును."

స్థూలదృష్టికి ఇది హైదరాబాద్ నగరవాసులకొరకేర్పడిన యొక స్థానికసంఘము. అట్లుండియు, పై నియమములలో వాడబడిన శబ్దములు విశాలతరమగు అర్థమును సూచించుచున్నవి, పేరును ఉద్దేశమును, వివరించునట్టి మొదటి రెండు

నియమములలోని "హైదరాబాదు నగరము" అనుటకు మారుగా, "నిజాంరాష్ట్రము" అను శబ్దములును, సాధనోపాయములను, సభానదు డగుటకు అర్హతను నిర్ణయించు తరువాతి రెండునియమములలోను రాజధానీ నగరము పేర్కొనుటకు బదులు "ఈ రాజ్యము" అనుశబ్దములును వాడబడినవి. ఈ యంశములను దృష్టియందుంచుకొని చూచినచో, సంఘ స్థాపకులు నిజాంరాష్ట్రములోని యాంధ్రులందరికిని ప్రాతినిధ్యమునువహించబోవు నొక గొప్ప సంఘమును అస్తిత్వమునకు దేవలయునని సంకల్పించి యుండినట్లు కావచ్చును.

ఉద్దేశమును వివరించు నియమము (ని. ౨) లో నిజాం రాష్ట్ర వాసులగు ఆంధ్రుల "అభివృద్ధికై ప్రయత్నించుట" యను మాటవలన,స్థాపకుల వాంఛలయొక్కయు, దృక్పథము యొక్కయు వైశాల్యము ఎక్కువగా నుండినట్లు స్ఫురింపక మానదు. రాజ్యములోనివారి సర్వతోముఖమగు అభివృద్ధి వీరి యాశయమని ఊహించుటకు అవకాశము కానవచ్చుచున్నది.

సాధనోపాయముల దెలుపుచున్న నియమము (ని. ౩) లోని శబ్దములవలన, అంతకు పూర్వమునుండియు నిజాంరాష్ట్రమునందు ఆంధ్రుల క్షేమముకొరకు కృషిసల్పుచున్న సంఘములను, సంస్థలను ఒక అంగనిర్మాణము క్రిందకు దేవలయునను తలంపు వ్యక్తమగుచున్నది.

సభ్యత్వమునకు అర్హతను, లేక, యోగ్యతను నిర్ణయిం చునట్టి నియమము (ని. ౪)లో "వ్యక్తి" యను శబ్దముపయో గింపబడినది. ఇందువలన నీయుద్యమమున స్త్రీలకుగూడ స్థానము కల్పించవలయునను ఆశయము ద్యోతకమగుచున్నది. సభాసదు లగువారికి పదునెనిమిది సంవత్సరములకు మించినవయస్సు ఉండవలయునను నిబంధనవలన, రాష్ట్రములోని శాసనముల ననుసరించి బాధ్యత వహించు వయస్సుగలవారు మాత్రమే దీనిలో చేరునట్టి కట్టుదిట్టము ఏర్పడుచున్నది. ఆ కాలమున— అనగా నేటికి ఇరువదియేడుసంవత్సరములకు పూర్వము—ఇట్టి యుద్యమమున చదువురానివారికి ప్రవేశము కలిగించుట క్షేమ కరము కాదని స్థాపకులు తలంచిరాయనుసందియము తోచును.

పై నియమములనుబట్టి, సంఘసభ్యత్వమునిజాము రాష్ట్ర వాసులగువరకు మాత్రమే పరిమితముగా నుంచవలయునని అప్పటి ముఖ్య కార్యకర్తలగువారు భావించియుండినట్లు ఎవరికైనను స్ఫురింపక మానదు. ఆకాలమునను హైదరాబాదు నగరము నందు, తాత్కాలికముగ నివసించియున్నవారు నిజాంరాష్ట్రే తరులగు నాంధ్రులుకొందరుండిరనుట నిస్సంశయము. అట్టివారు ప్రభుత్వోద్యోగములందును, ఇతర వృత్తులందును ఉండియుం దురు. అట్టివారు ఈసంఘమున చేరలేదని తోచుచున్నది. ఇందు

నకు పైన వివరించబడిన నియమముల పరిమితస్వభావమే కారణ మని చెప్పవలయును.

మదరాసు ప్రాంతములోని తెలుగుజిల్లాలలో నివసించు మన యాంధ్రసోదరులు, ఇచటి యాంధ్రోద్యమ మారంభము కాకపూర్వము ఎన్నియో సంవత్సరములనుండి "ఆంధ్రోద్యమము" ను సాగించుచుండిరి. *అచ్చట "ఆంధ్రమహాసభలు" అనుపేర వార్షికసమావేశములు వైభవముగ జరుగుచు, రాజకీయముగ ప్రచండమగు ప్రాముఖ్యమును సంపాదించియుండెను. అక్కడి యాంధ్రోద్యమమునందు ఆంధ్రరాష్ట్రనిర్మాణముప్రధానాశయమని నిశ్చయింపబడి యుండెను. అనగా మదరాసు రాజధానిలోని ౧౧ ఆంధ్రజిల్లాలు తమిళాది ఇతరప్రాంతములనుండి విడిపోయి, ప్రత్యేకప్రాంతముగా నేర్పడునట్లు ఆందోళనసల్పుట

---

*"ఆంధ్రదేశము మదరాసుప్రాంత మందొక ముఖ్యభాగము. నిజాము రాజ్యమునందు విశాలమైన యాంధ్రదేశము కలదు. గాని రాజకీయ చర్చలందా ప్రదేశమును జేర్చుట యసంగతము...ఆంధ్రోద్యమమునకు ప్రధానాంగము ఆంధ్రరాష్ట్రము...ఆంధ్రోద్యమమునందు ప్రత్యేకాంధ్రరాష్ట్ర దర్శ మిమిడియున్నది...ఆంధ్రోద్యమాంకురములు పల్లవితము లగుచున్నవి. ఆంధ్రమహాసభలయందు తీర్మానింపబడిన విషయములు కాలక్రమమున సఫలములగుట సహజము" (ఆంధ్రపత్రిక, అయిదవసంవత్సరాది సంచిక, ప్రస్తావన పుటలు ౨-౫)

అచ్చటి మన సోదరుల కార్యక్రమమునకే ప్రాధాన విషయమై యుండెను. ఆ కారణమువలన, నిజాంరాష్ట్రములో ప్రారంభ మగుచున్న ఆంధ్రోద్యమమును విడిగాను ప్రత్యేక లక్షణాలక్షి తముగాను ఉంచుట ఉద్యమస్థాపకులు అవసరమని భావించి యుండవచ్చును. అం దాశ్చర్యముగాని, వైపరీత్యముగాని స్ఫురింపదనితలంతుము. దూరదృష్టిలేనివారు కొందరు, ఈవిష యమున నపోహాలు కలిగించి, అసూయభావప్రేరితులై ఇచ్చటి యాంధ్రోద్యమవ్యాప్తికి కొన్ని యంతరాయముల కలిగించుట మాపాఠకులు ముందు, ఉచితసందర్భమున, చూడగలరు.

నియమావళి యంగీకరింపబడిన తరువాత, హైదరా బాదు నగరమునమన్న ఈయాంధ్రజనసంఘము ♦ఆంధ్రోద్యమ వ్యాప్తికై మంచిపనిచేసినది. నగరములోని వివిధప్రాంతములలో నుపన్యాససభలను సమావేశపరచి మంచి ప్రబోధము కలిగించ గల్గెను. "ఆంధ్రజనసంఘము"లను పేరు రాష్ట్రములోని అనేక స్థలములందు సంఘములు స్థాపింపబడినవి. నగరములోని సంఘ కార్యకర్తలు జిల్లాలలోకూడ పర్యటన సల్పి ఆంధ్రోద్యమ

♦ ఈ సంఘము ఇప్పటికిని ఆంధ్రమహాసభ యొక్క జిల్లాసంఘముగా పనిచేయుచున్నది. నిజాంరాష్ట్రఆంధ్రోద్యమము నారంభించిన ఈసంఘము యొక్క-౨౫ సంవత్సరముల సేవ చాలబోధప్రదముగా నుండును. కార్యక ర్తలు అట్టిచరిత్రను ప్రకటింతురుగాక!

సందేశమును నలుదెసలకెగ బ్రాకించిరి. బొంబాయి నగరములోని ఆంధ్రసోదరుల సానుభూతిని సంపాదించిరి. అముద్రిత గ్రంథములను, తాళపత్ర ప్రతులను, శాసనముల ప్రతిబింబములను సంపాదించి ప్రకటించుట కొరకు పరిశోధకమండలిని తమ సంఘ యాజమాన్యమున స్థాపించిరి.♦ ఇంకను ఎన్ని యోపనులను చేసిరి కాని "ఆంధ్రజనకేంద్రసంఘ" మనునది ఏర్పడువరకు ఆంధ్రోద్యమవ్యాప్తికై చేయవలసిన కార్యప్రణాళిక ఏర్పడలేదు. అట్టి కేంద్రసంఘమును స్థాపించుటకై జరిగినకృషియు, తత్ఫలితములును ముందుప్రకరణములో రాగలవు.

---

♦ ఈ మండలి మొటద "ఆంధ్రపరిశోధకమండలి" యను పేరుతో స్థాపింపబడినది. విఖ్యాత పరిశోధకులును, గ్రంథరచయితలును నగు కొమర్రాజు వేంకట లక్ష్మణరావు ఎం.ఏ. గారు దివంగతులైనతరువాత, వారి స్మరణార్థము, ఈసంస్థకు 'లక్ష్మణరాయ పరిశోధకమండలి' యని క్రొత్త నామకరణము చేయబడినది. కొన్ని సంవత్సరములు పనిచేసినతరువాత, ఆంధ్ర మహాసభయొక్క నియమావళి ననుసరించి, ఈ మండలి ఆంధ్రోద్యమ సంఘములనుండి విడివడి, స్వతంత్ర సంస్థగా పనిజేయుచున్నది. ఈ మండలికి శ్రీ రాజా నాయని వేంకట రంగారావు బహదరు, మునగాల జమీందారు గారు, అధ్యక్షులు. శ్రీఆదిరాజు వీరభద్రరావుగారు, కార్యదర్శి. మండలి చేసిన అమూల్యసేవ ఒక ప్రత్యేక చరిత్రకు తగిన సాధనములు కలదిగా నున్నది. అట్టి చరిత్ర కాలక్రమమున వెలువడు భాగ్యము కలుగుగాక!

# తెలంగాణా ఆంధ్రోద్యమము.

## 3

### ఆంధ్రజనకేంద్ర సంఘము.

హైదరాబాదులో స్థాపితమైన ఆంధ్రజనసంఘముల వంటివి తెలంగాణములోనిమరికొన్ని ప్రదేశములందును ఏర్పడిన తరువాత, ఆంధ్రోద్యమకార్యములను ఎక్కువ విశాలముగను, ఎక్కువ క్రమబద్ధముగను సాగించుటకును, అన్ని సంఘములపై నను పరిభావము కలిగియుండుటకును ఒక కేంద్రసంఘముండుట అవసరమనితోచినది. మొట్టమొదటజరుగవలసినపని అట్టి కేంద్ర సంఘమునకొరకు నియమావళిని సిద్ధపరచుటయని నిశ్చయించ బడెను. అప్పటివరకుస్థాపితములైన ఆంధ్రజనసంఘములప్రతినిధు లను ఈకార్యమునునిర్వహించుటకై హనుమకొండకురావలయు నని శ్రీమాదిరాజు రామకోటీశ్వరరావుగారాహ్వానించిరి. దాని ననుసరించి,ఆయాసంఘముల ప్రతినిధులు, ౨౭-౭-౧౩౩౨ ఫ. (౧-౪-౧౯౨౩)నాడు హనుమకొండలో నమావేశమైరి, స్థానికాంధ్ర జనసంఘమువలన ప్రతినిధులు సర్వసౌకర్యముల ననుభవించిరి.

ఆనాటిసభలో (౧) హైదరాబాదు(౨) సికింద్రాబాదు (౩) వరంగల్లు (౪) ఖమ్మముమెట్టు (౫) హుజూరాబాదు సంఘ

ముల ప్రతినిధులు పాల్గొనిరి. ♦ హైదరాబాదనుండివచ్చిన శ్రీ కొమ్మవరపుసుబ్బారావుగారును సభాకార్యములలో తోడ్పడిరి.

ఈ సమావేశము ఆనాడంతయు పనిచేసెను, ఉదయమున రావుబహాదరు సామల వేంకటరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన సభకుప్రతినిధులు గాక ప్రేక్షకులుదాదాపు ౧౦౦ మంది వచ్చియుండిరి. † ఆంధ్ర కవికుమారులవలన రసవంతములగు పద్యములు చదువబడెను, శ్రీ రామకోటీశ్వరరావుగారు స్వాగతోపన్యాస మొనర్చిరి. ప్రతినిధి మహాశయులు పలువురు ఆంధ్రోద్యమమునుగూర్చి యుపన్యసించిరి. తరువాత, ఆనాడు (వర్కుసగా) ప్రతినిధులుకూడి రాత్రి ౧౨.గంటలవరకు చర్చలు

---

♦ హైదరాబాదువారు: (౧) మా. హనుమంతరావు (౨) కో. వే. రంగారెడ్డిగారు (3) వడ్లకొండనరసింహారావుగారు. సికింద్రాబాదువారు (౪) రావుబహాదరు సామల వేంకటరెడ్డిగారు, (౫) జొన్నలగడ్డశోభనాద్రిః శాస్త్రిగారు (౬) భాగి సుబ్రహ్మణ్యముగారు. వరంగల్లు: (౭) మా. రామకోటీశ్వరరావుగారు(౮)కొండపల్లి సీతారామరావుగారు (౯) మౌల్వీ రఫీయుద్దీను సా॥. ఖమ్మంమెట్టువారు:_(౧౦)కీ. శే. వేముగంటిరామకిషను రావుగారు (౧౧) మాదిరాజు వేంకటేశ్వరరావుగారు (౧౨) నీలకంఠరావుగారు హుజూరాబాదువారు:_అక్కినేన రామచంద్రరావుగారు.

† (౧)మాదిరాజు నాగభూషణరావుగారు(౨)అల్లూరి రాజేశ్వరరావుగారు (3) వానమామలై లక్ష్మణాచార్యులుగారు.

జరిపి ఆంధ్రజన కేంద్రసంఘ నియమావళిని అంగీకరించిరి. చర్చల సందర్భమున ఖమ్మముమెట్టు ప్రతినిధులలో మొదటి యిద్దరు తప్ప తక్కినవారు అందరును ఉత్సాహమును, సహకార భావమును ప్రకటించుచు కార్యనిర్వహణ మొనర్చిరి. మరునాడు కొందరు ప్రతినిధు లచ్చటనే యుండిరి. ఆసాయంత్రము మట్టెవాడలో శ్రీరామలింగేశ్వరాలయమునందు శ్రీ కొండా వేంకట రంగారెడ్డిగారి యధ్యక్షతతో బహిరంగసభ జరిగినది. కొందరు ప్రతినిధులు ఆంధ్రుల యాశయముల దెల్పుచు ఉపన్యసించిరి. కొందరు స్థానిక ఆయుర్వేద విద్యాపీఠమును పునరుద్ధరించు విషయమున ప్రసంగములు సల్పిరి: ఆ రాత్రి డా. వద్దిరాజు వేంకటేశ్వరరావు వకీలుగారు, ప్రతినిధులకు విందుచేసి సన్మానించిరి. ♦

---

♦ సమావేశ దినములలో ఉత్సాహముగా స్వాగతసంఘము పక్షమున శ్రమచేసి ప్రతినిధులకు సౌకర్యముల నమకూర్చిన సోదరులలో పేర్కొనదగిన ముఖ్యులు: (౧) శ్రీ తూము వరదరాజులుగారు (స్వచ్ఛంద సేవకుల నాయకులు) (౨) శ్రీ దే. వేం. చలపతిరావుగారు (౩) శ్రీ చి. రాజశేఖరం గారు (౪) శ్రీ పులిపాక కోటయ్యగారు (౫) శ్రీ ఆ. వేంకటకృష్ణయ్య గారు (౬) శ్రీ డి. వేంకటకిషన్ గారు.

## మొదటి సమావేశము (హైదరాబాద)

నియమావళిసిద్ధమైనతరువాత దాదాపు నాల్గుమాసము లకు ఆంధ్రజన కేంద్రసంఘముయొక్క మొదటి సమావేశము ౨౦ మహారేవరు ౧౩౩౨ ఫ, (౨౭-౭-౧౯౨౩) నాడు హైదరాబాదు పట్టణమున, మాడపాటి హనుమంతరావుగారి గృహము నందు జరిగినది. హైదరాబాదు, సికిందాబాదు, వరంగల్లు కరీంనగరము, నల్లగొండ, నిజామాబాదు, మెదకు, మహబూబు నగరము అను ౮ జిల్లాలపక్షమున ఎన్నుకొనబడిన (౩+౨+ ౨+౨+౧+౧+౧+౧) ౧౩ గురు ప్రతినిధులలో ౭ గురు ♦ వచ్చియుండిరి. వీరుకాక, నగరవాసులును, జిల్లాల వారును నగు ౬ గురు ‡ ఆంధ్రోద్యమ కార్యకర్తలు ప్రేక్షకులుగా సభ నలంకరించిరి. రావుబహాదురు సా. వేంకటరెడ్డిగారు అగ్రాసనాధిపత్యము వహించిరి.

---

♦ శ్రీయుతులు కొండా వేంకటరంగారెడ్డి, మా. హనుమంతరావు రావుబహద్దరు వేంకటరెడ్డి, భాగిసుబ్రహ్మణ్యము, బసవేశ్వరరావు (హుజూరాబాదు, శేషాద్రిరావు (నల్లగొండ), టి. కె. బాగయ్య (నిజామాబాదు) గార్లు,

‡ శ్రీయుతులు నడింపల్లి జానకిరామయ్య, పాలపర్తి సత్యనారాయణ, శా. సుబ్బారావు, పచ్చ రంగారావు (హనుమకొండ), కోట కిషన్ రావు (జగిత్యాల), పువ్వాడ వేంకటప్పయ్య (సూర్యాపేట) గార్లు.

ఆనాడు జరిగిన కార్యములు:- (1) వరంగల్లులో ప్రతినిధులవలన నంగీకరింపబడిన నియమావళిని చదివి స్థిరపరచుట. (2) కేంద్రసంఘమునకై ఆ సంవత్సరమునకుగాను రావుబహాదరు గారిని అధ్యక్షునిగాను, మా. హనుమంతరావును కార్యదర్శిగాను ఎన్నుకొనుట (అంతకుపూర్వము వరంగల్లులో జరిగిన ప్రతినిధి సమావేశమునుండి అప్పటివరకు శ్రీ వడ్లకొండ నరసింహారావుగారు తాత్కాలిక కార్యదర్శిగాపనిచేయుచుండిరి.) (3) కొమరరాజు లక్ష్మణరావుగారి మరణమునుగూర్చి సంతాపమును ప్రకటించుట. (4) అన్ని సంఘములకు వర్తించుటకై ఉపనియమము లంగీకరించుట.

ఈ యుపనియమములలో, ఆసంవత్సరమున ఆంధ్రజన సంఘములు చేయవలసిన కార్యములు ఈక్రిందివిగా నిర్ణయింపబడినవి:—

(అ) గ్రంథాలయములను, పఠన మందిరములను, పాఠశాలలను స్థాపించుట.
(ఆ) విద్యార్థులకు సహాయము ప్రోత్సాహము చేయుట.
(ఇ) విద్వాంసులను గౌరవించుట.
(ఈ) తాళపత్ర గ్రంథములను, శాసనముల ప్రతులను సంపాదించుట, పరిశోధించుట.

(ఉ) కరపత్రములమూలమునను, లఘుపుస్తకముల మూలమునను, ఉపన్యాసములమూలమునను విజ్ఞానమును వ్యాపింపజేయుట.

(ఊ) ఆంధ్రభాషాప్రచారమునకై వలయుప్రయత్నములు సలుపుట.

(ఋ) వ్యాయామములను, కళలను ప్రోత్సాహపరచుట.

(ౠ) అనాథులగువారి కత్యవసరమగు సహాయము చేయుట.

ఆనాటి కార్యక్రమములో నీ చివరనున్న యంశము చాలముఖ్యమైనది. ఏలయనగా: అప్పుడు ఆంధ్రోద్యమవ్యాప్తి కొరకు జరుగవలసిన కార్యముల ప్రణాళిక యొకటి పై విధమున నిర్ధారణమైనది దీనివలన, ఆంధ్రజన కేంద్రసంఘమువారి కార్య విధానము (పాలిసీ), స్పష్టముగా దెలియుచున్నది. ఈ కార్య ప్రణాళిక ఆంధ్రజన సంఘములకొరకు మాత్రమేయని తలంచ గూడదు. ఆంధ్రజన కేంద్రసంఘము తన కార్యములనుగూడ పై హద్దులకే లోబరచుకొని యుండెననుట కేంద్రసంఘము యొక్క తరువాతి మూడు సమావేశములు వలనను ధ్రువపడు చున్నది.

## రెండవ సమావేశము (నల్లగొండ.)

కేంద్రసంఘముయొక్క రెండవసమావేశము నల్లగొండలో 'నీలగిరి' పత్రికా సంపాదకులగు కీ. శే. షబ్నవీసు వేంకటరామనరసింహారావుగారి కార్యాలయపు ఆవరణయందు, ప్రత్యేకముగా స్థానికాంధ్రజనసంఘము వారిచే నిర్మింపబడిన విశాలమంటపమున, ౧౭-౬-౧౩౩౩ఫ. (౨౧-౩-౧౯౨౪) నాడు జరిగినది. వివిధజిల్లాలనుండి వచ్చిన ౭ గురు ప్రతినిధులతోను, జిల్లాలలోని ౫౦ మంది ప్రేక్షక ప్రముఖులతోను, కేంద్రసంఘాధ్యక్షుడగు, రావుబహాదరు, వేంకటరెడ్డిగారి యధ్యక్షతక్రింద సభ సమావేశమైనది.

సభలోజరిగిన పనులలో ముఖ్యమైనవి:-(౧) చెలికాని లచ్చారావు, వంగూరి సుబ్బారావుగార్లు దివంగతులైనందునకు దుఃఖము ప్రకటించబడెను. (౨) ఉద్యమ కార్యములకొరకు "నిజాంరాష్ట్రాంధ్రనిధి" ఏర్పరుపబడి, దానికి శ్రీకొండా వేంకట రంగారెడ్డిగారు వ్యవహర్తలుగా ఎన్నుకొనబడిరి. (౩) వేతనము పైన ఒక ప్రచారకుని నియోగించవలయునని నిశ్చయింపబడినది. (౪) పరిశోధకసంఘమును హైదరాబాదు ఆంధ్రజనసంఘ యాజమాన్యమునుండి కేంద్రసంఘ యాజమాన్యమునకుమార్చ

వలయును. (౫) (అ) ఎచ్. ఎస్. ఎల్. సి. (ఆ) ఉస్మానియావిశ్వ విద్యాలయపు మెట్రికు, (ఇ) ఇంటర్మీడియేటు (ఈ) బి. ఎ. పరీక్షలందు ఆంధ్రభాషతో ప్రథములుగ ఉత్తీర్ణులైనవారికి వెండి పతకములును, బంగారుపతకములును ఇచ్చి సన్మానించవలెను. (౬) ఆంధ్రవాఙ్మయప్రచారమునకై పరీక్షల నేర్పాటుచేయుట కొకవిధానము సిద్ధము చేయవలెను. (౭) నిజాంరాష్ట్రములోని ఆంధ్రుల స్థితులను దెలుపు లఘుపుస్తక మొకటి వ్రాయించి అణాకు మించని వెలకు విక్రయించవలెను అని తీర్మానింపబడెను.

పై వాని అమలు చాలవరకు జరిగినది. ప్రచారకుడు దొరకనందున ఆపని కాలేదు. *పరీక్షలలో ఉత్తములుగాఉత్తీ

*ఉస్మానియా బి. ఎ. పరీక్ష: కీ. శే. పరాంకుశం నారాయణరావు గారికి: బంగారుపతకము.

—''— ఇంటరు: కీ. శే. గంగరాజు రఘునాథరావుగారికి

—''— మెట్రికు: పటుకరు నరసింహారావుగారికి వెండి పతకము (బి.ఏ., ఎల్.ఎల్.బి. యైనవీరు ఇప్పుడు న్యాయవాదులుగా మహబూబునగరములో పని చేయుచున్నారు. ఆంధ్రసారస్వతోద్యమమున అభినివేశము గలవారు.)

ఎచ్. ఎస్. ఎల్. సి. పరీక్ష: సూరి భగవంతముగారికి —''—

(ఈ తుదివారు రాష్ట్రమున ప్రథములుగా నెగ్గి గోల్డ విద్యార్థి చేత

ర్ణులైనవారికి పతక బహుమానములు విఖ్యాతులగు శ్రీ పింగిలి వేంకటరామరెడ్డిగారి యధ్యక్షతన నగరమందు జరిగిన గొప్ప సభలో ఇయ్యబడినవి. ‡

ఈ సందర్భమున నల్లగొండలో బహిరంగ సభలుకూడ జరిగినవి. ఉపన్యాసకులలో శేషాద్రిరావు వకీలుగారును, మహా, మన్సూరు సా. గారును, ఇతర ఆంధ్ర కార్యకర్తలును ఉండిరి. ప్రభుత్వమువారి శిల్ప [తామీరాతు] శాఖలో అధికారిగా నుండిన శ్రీ కూర్మారావుగారు కేంద్రసంఘసభ్యులకు విందొసగి సన్మానించిరి.

---

నము పొందినారు. ఎం ఏ. ఐన వీరు ఇప్పుడు ఆంధ్రవిశ్వవిద్యాలయ కళాశాల, విశాఖపట్టణములో ప్రిన్సిపాలుగా నున్నారు.

‡ఆనాడే ఆంధ్రజనసంఘము (హైదరాబాదు) పక్షమున వ్యాస రచన పోటీపరిక్షలో గెలుపుగాంచినందునకు ఈ క్రిందివారికి బహుమతు లియ్యబడినవి:—

(1) శ్రీ పింగిలి వేంకటరామారెడ్డిగారి సువర్ణరజత పతకము(అప్పుడు బి. ఏ. తరగతివిద్యార్థి, ఇప్పుడు ఎం. ఎస్సి, ఉస్మానియా కాలేజి ప్రొఫెసరు) శ్రీ ఇల్లెందుల సీతారామరావుగారికి.

(2) సంఘమువారి పుస్తకరూపమున బహుమానము, శ్రీ భృగుబండ చంద్రమౌళిగారికి.

(3) శ్రీసదాశివరెడ్డి దేశాయిగారి బహుమానము రు. 10 లు కంభంపాటి సోమయాజులవారికి.

## మూడవ సమావేశము; మధిర.

కేంద్రసంఘముయొక్క మూడవ సమావేశము, కీ. శే. మాడపాటి తిరుమలరావు, హైకోర్టువకీలుగారి అధ్యక్షతతో నేర్పడిన యొక ప్రత్యేక ఆహ్వాన సంఘమువారి పిలుపు ననుసరించి, మధిరలో, శ్రీ పింగిలి వేంకట రామరెడ్డిగారి కర్మాగారపు ఆవరణలో నిర్మింపబడిన విశాల మంటపమున ౨౦-౫-౧౩౩౪ ఫ. (౨౧-౨-౧౯౨౫.) నాడు జరిగినది. రావుబహాదరు వేంకటరెడ్డిగారగ్రాసనాధిపత్యము వహించిరి.

దైవప్రార్థనము, ప్రభువుగారి ప్రశంస, ఆంధ్రమాతృస్తవము [శ్రీ వానమామలై లక్ష్మణాచార్యులు, శ్రీవిష్ణుదాసు గిరిధరరావుగార్లవలన] సల్పబడెను. శ్రీ మాడపాటి తిరుమలరావు పంతులుగారు స్వాగతోపన్యాసము చదివిరి. ౧౯ మంది ఆంధ్రజన సంఘముల ప్రతినిధులు, ౨౦ మంది గ్రంథాలయ ప్రతినిధులు, ౧౦౦ గురు ప్రేక్షకులు సభయందుండిరి.

(౪) శ్రీమతి వందిటి సత్యవతీ దేవిగారికి రు. ౫ల బహుమానము, సూర్యాపేట వర్తక సంఘంవారిది, కీ. శే. లాభిశెట్టి లింగన్న గుప్తగారిద్వారా.

ఈ సమావేశమున జరిగినముఖ్య కార్యములు: (౧)వనపర్తి సంస్థానాధీశ్వరులగు శ్రీ రాజాకృష్ణదేవరాయ బహిరీ బలవంతుగారి యొక్కయు, శ్రీగద్వాల సంస్థానాధీశ్వరులగు సీతారామ భూపాలుగారి యొక్కయు, జోగిపేట ప్రజా కార్యకర్త శివ్వప్పగారి యొక్కయు, అకాలమరణమునకు దుఃఖము తెల్పబడినది, (౨) ఆంధ్రపరిశోధక సంఘమునకు కార్యవర్గము ఎన్నుకొనబడినది, † (౩) హైదరాబాదులోని ప్రభుత్వ వైద్యకలాశాలలోని, శిల్ప (ఇంజనీరింగు) కలాశాలలోని రాబోవు తుది పరీక్షయందు అత్యుత్తములుగ ఉత్తీర్ణులైనవారిని సువర్ణ పతకములతో గౌరవించవలయును. ‡ (౪) నిజాంరాష్ట్రియాంధ్రులు

---

† కార్యవర్గ సభ్యులు: (౧) ప్రొఫెసరు శిరుగూరి హనుమంతరావుగారు, ఎం. ఏ (అధ్యక్షుడు.) (౨)మునగాల సంస్థానాధీశ్వరులు, శ్రీరాజా నాయని వేంకటరంగారావు బహద్దరు (౩)మాడపాటి హనుమంతరావుగారు (౪)రాజబహద్దరు పిళ్లేగారు, బి. ఏ. బి. ఎల్. (౫)ఆదిరాజు వీరభద్రరావు. గారు (కార్యదర్శి.)

‡ ఈ బహుమానములు హైదరాబాదులో ౧౩-౧-౧౩౩౫ఫ. (౧౮-౧౦-౧౯౨౫) నాటి, శ్రీపింగిలి కోదండ రామా రెడ్డిగారి అధ్యక్షతగల సభలో ఈ క్రిందివారికి ఇయ్యబడినవి:-

(౧) (డాక్టరు) బి. పుల్లారెడ్డిగారికి బంగారు పతకము. (వీరు ఇంగ్లాండునకు వెళ్లివచ్చి గొప్ప డాక్టరు పదవియందు లాలాగుడెము వైద్యశాలలో ఇప్పుడున్నారు.)

(౨) గొల్లి మల్లి కార్జునుడుగారికి (శిల్ప విద్య పరీక్ష)బంగారు పతకము.

ఆంధ్రభారతీ తీర్థ (విజయనగరము) పరీక్ష నియ్యవలయునని ప్రోత్సహింపబడిరి. (౫) "నిజాం రాష్ట్రాంధ్రుల యభివృద్ధిమార్గములు" అను విషయమున, (౫౧ రూపాయల) బహుమాన వ్యాసము వ్రాయించి, లఘుపుస్తకరూపమున అచ్చొత్తించి అణాకు మించని వెలకు విక్రయించవలెను. (౬.) బొంబాయి, నగరములోని ఆంధ్ర సోదరులు తెల్పిన సానుభూతికి కృతజ్ఞత, (శ్రీ. శ్రీ.) శంకరశాయన్న పర్యాగారిద్వారా తెలుపవలెను అని తీర్మానింపబడెను.

ఈ సందర్భమున, మరునాడు, నిజాంరాష్ట్రములోని ఆంధ్ర గ్రంథాలయముల మొదటి మహాసభ కూడ జరిగినది. దీని వివరములు వేరొకచోట కాననగును.

కేంద్ర సంఘముయొక్క మూడవ సమావేశము జరిగిన తరువాత, నాల్గవసమావేశము, నల్లగొండజిల్లా సూర్యాపేటలో, మూడేండ్ల మూడునెలల తరువాత, ప్రభుత్వమువారి యాజ్ఞ లభించనందున, చాల ఆలస్యముగాజరిగినది. (౫౧-౮-౩౨ ఫ.= ౩౦-౫-౧౯౨౨.) ఈ మధ్యకాలములో కొన్ని యితర ముఖ్య కార్యములు జరుపబడినవి. వానిలో పేర్కొనదగినవి రెండు:—

౧. ఉస్మానియావిశ్వవిద్యాలయముయొక్క ఆంధ్ర పట్టభద్రుల సన్మానము శ్రీ కైలా బలవంత రెడ్డి గారి భవనమున వైభవముగ జరుపబడినది. మేజరు ముత్యాల గోవిందరాజులు నాయడు గారు అధ్యక్షత వహించిరి, శ్రీ గాడేపల్లి సూర్య ప్రకాశరావు. ఎం. ఏ, ఎల్. టి. గారు ప్రబోధకరమగు ఉపన్యాసము పట్టభద్రుల కొరకుచేసిరి. అల్పాహారపువిందు గొప్పగాజరిగినది.†(౨౫-౧౨-౧౩౩౮ఫ । ౩౦-౯-౧౯౨౫(

౨. శ్రీమా. రామాచార్యులగారు అను చిత్రలేఖ విద్యార్థిని ప్రోత్సహించు నుద్దేశముతో విఖ్యాతులగు శ్రీసురవరము ప్రతాపరెడ్డిగారు కొంత ధనము ప్రోవుచేసిరి. ఇంకను కొంత ధనము కేంద్రసంఘమువారు చందాలవలన సంపాదించి పైవిద్యార్థిని జూలై ౧౯౨౫ నుండి మార్చి ౧౯౨౬ వరకు బందరులోని ఆంధ్ర జాతీయ

---

† అల్పాహారపు విందున కైన వ్యయములలో ఎక్కువ భాగము శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారును, మిగిలిన వ్యయ భారమును శ్రీకైలా బలవంత రెడ్డి మాడపాటి హనుమంతరావు గార్లును భరించిరి.

కళాశాలయందు చిత్రలేఖనము నభ్యసించుటకై ఉంచిరి.♦

3. ఉస్మానియా విశ్వవిద్యాలయపు ఆంధ్ర పట్టభద్రుల సన్మానసభ ౧-3-౧౯3౬, ఫ్ర(౧౫-౧౨-౨౬) నాడు రాజాబహద్దరు వేంకటరామా రెడ్డి ఓ. బి. ఇ. గారి యధ్యక్షతతో జరుపబడెను. ప్రొఫెసరు శిరుగూరి హనుమంతరావు, ఎం.ఏ. గారు విద్యార్థులను ప్రబోధించుచు ఉపన్యసించిరి. ఉపహారవిందు ఏర్పాటు చేయబడెను. పట్టభద్రులందరును పుష్పమాలాలంకృతులైరి. ఛాయాపటము గైకొనబడినది.

తృతీయ సమావేశమున అంగీకరించబడిన తీర్మానము ననుసరించి "నిజాంరాష్ట్రాంధ్రుల యభివృద్ధి మార్గములు" అను విషయమును గురించి పోటీ వ్యాసములు తెప్పింపబడెను. వాని

---

♦ ఈవిద్యార్థి చిత్రలేఖనమున మంచి ప్రావీణ్యము సంపాదించి వచ్చెను. కళాశాలవారి వలన ప్రశంసను పొందెను. తరువాత శ్రీ రాజాబహద్దరు వేంకట రామారెడ్డి ఓ. బి. ఇ. నగర కొత్వాలు గారి సహాయమున ఛాయాచిత్ర గ్రహణము (ఫోటోగ్రఫీ) కూడ నేర్చుకొనెను. ఆచార్యులుగారి చిత్రములు, అడయారు, లక్నో, కలకత్తా ప్రదర్శనములందు మెప్పువడసినవి.



డాక్టర్ ఒద్దిరాజు సీతారామచంద్రరావు, రాఘవ రంగారావు గారలు



ఉస్మానియా ఆంధ్ర పట్టభద్రుల సభ.

లో అత్యుత్తమము లగువానికి బహుమానము లియ్యబడినవి. బహుమానములు పొందినవారిలో ఇద్దరు నిజాంకాలేజి (హైదరాబాదు) విద్యార్థులు. *

నాల్గవ సమావేశము: సూర్యాపేట.

కేంద్రసంఘముయొక్క ఈ సమావేశము వెనుకచెప్పిన ప్రకారము చాల ఆలస్యముగా, ౨౫-౮-౧౩౩౭ ఫ.(౩౦-౫-౧౯౨౮) నాడు, ఉన్నతవిద్యాభూషితుడగు (ఇప్పుడు కీ. శే. డైన) శ్రీకోదాటి రామకృష్ణారావు బి. ఏ. ఎల్. ఎల్. బి గారుఅధ్యక్షులుగా నుండిన యొక యాహ్వాన సంఘమువారి పిలుపుపైన, సూర్యాపేటలో ప్రత్యేకముగా నిర్మితమైన మంటపమున చాలఉత్సాహముతో జరిగినది. రావుబహాదరు వేంకట

* (౧) శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారు: బహు; రు. ౨౫(ఎం. ఏ. పరీక్షలో నుత్తీర్ణులై వీరిప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయములో తెలుగు లెక్చరరుగా నున్నారు. గ్రంథకర్తలు.)

(౨) శ్రీగడ్డం కేశవసోమయాజులుగారు: బహు: రు. ౧౫.

(౩) శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరముగారు: బహు: రు. ౧౦

(ఎం ఏ పట్టమునుబొందిన వీరిప్పుడు వరంగలునందు ప్రభుత్వ కాలేజీలో ఉపన్యాసకులు: గ్రంథకర్తలు)

రెడ్డిగారు రానందున శ్రీ కొండా వేంకటరంగా రెడ్డిగారు అధ్యక్షులైరి. సంప్రదాయ సిద్ధముగా ప్రార్థనాదులు జరుపబడినవి.

జరిగిన పనుల సంగ్రహము:—(౧) జటప్రోలు సంస్థానాధీశ్వరులగు శ్రీరాజా సురభి వేంకటలక్ష్మారావు బహాదరుగారి యొక్కయు, ఆంధ్రోద్యమ కార్యకర్తలగు శ్రీ సదాశివ రెడ్డి, శ్రీ చిరాగు వీరన్నగార్ల యొక్కయు మరణములకు విచారము ప్రకటింపబడినది. (౨) విఖ్యాత గద్వాలసంస్థానమునకు మహారాణిగా ప్రభుత్వమువారిచే నంగీకరింపఁబడి రాజ్యపాలనా భారమును వహించిన శ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ అమ్మగారిని అభినందించిరి; (3) శ్రీ గద్వాల మహారాణీగారికి దౌహిత్రుడు జన్మించినందునకు సంతోషప్రదర్శనము జరిగెను. (౪) ఉస్మానియా విశ్వవిద్యాలయపు బి. ఎ. ఇంటరుపరీక్షలలో అత్యుత్తములుగా నుత్తీర్ణులైన ఆంధ్రవిద్యార్థులకు పతకములియ్యవలెననిరి. ఆంధ్ర పట్టభద్రుల పేళ్లు ప్రకటింపగానే వారిని వెనుకటివలె సన్మానించిరి. [౫] ఆంధ్రోద్యమప్రచారమునకుగాను రు. ౫౦౦[కల్దారు] పంపిన బొంబాయి ఆంధ్రసోదరులను, ముఖ్యముగ శ్రీ శంకర శాయన్నపర్శగారిని ప్రశంసించిరి. [౬] ఉస్మానియావిశ్వవిద్యాలయ విద్యార్థులకు ఆంధ్రవిశ్వవిద్యాలయ సంబంధములగు సంస్థలలో ప్రవేశించుటకు అనుకూలములు కల్పించుటకై ప్రయ

త్నించవలయునని తీర్మానించిరి.

కేంద్ర సంఘముయొక్క ఈ సమావేశ సందర్భమున ఎన్నియో సభలు, మహోపన్యాసములు చేయబడినవి. వాని వివరములు మఱియొకచోట రాగలవు. *

తరువాతి సమావేశములు.

పై సమావేశము తరువాత కేంద్ర సంఘముయొక్క ఐదవ, ఆరవ, ఏడవ, ఎనిమిదవ సమావేశములు, వరుసగా, జోగిపేట, దేవరకొండ, ఖమ్మంమెట్టు, సిరిసిల్లలో ఆ యా స్థలములందు సమావేశమైన, మొదటి, రెండవ, మూడవ, నాల్గవ ఆంధ్ర మహా సభలతో పాటు జరిగినవి. అయినను, అవి యన్నియు నిజాం రాష్ట్ర ఆంధ్ర మహా సభలలో నంగీక రించబడు తీర్మానములను అమలులో పెట్టుటయే ప్రధాన

---

* నాల్గవసమావేశము తరువాత అయిదవ సమావేశము వరకుజరుప బడిన కొన్ని పనులు పేర్కొన దగినవి కలవు.

(౧) వేతనముపైన ప్రచారకులుగా శ్రీ ఉన్నవ వేంకటరామయ్యగారు దివ్యమైన పనిచేసిరి.

(౨) వర్తక స్వాతంత్ర్యము అను లఘుపుస్తకము ప్రకటింపబడెను.

కర్తవ్యముగా గలవైనవి. ఈ కారణము వలన ఆంధ్రజన కేంద్రసంఘ సమావేశములు నాల్గవదానితోనే పూర్తియైనవని భావించుట తప్పు గాదని తలచెదము. సిరిసిల్లలో జరిగిన మహాసభలో ఆంధ్రమహాసభా నియమావళి అంగీకరించబడినది. దానిలో స్థాయిసంఘ మనునది ఏర్పడినది. అందు మూలమున ఆ పిమ్మట కేంద్రసంఘ మను మాటయే లేకుండపోయినది.

పైన చెప్పబడిన యంశముల ననుసరించి, నాల్గవ దాని తరువాత జరిగిన కేంద్రసంఘ సమావేశ వివరముల నిచ్చుట చూపక వదలి వేయుచున్నాము.



# తెలంగాణా ఆంధ్రోద్యమము

## ౪
### ఆశయములు ; కార్యవిధానము.

ఇంచుమించుగా ౪౨ వేల చదరపు మైళ్ళ భూభాగము నాక్రమించుచున్న అరువది లక్షలకంటె హెచ్చుగా నున్నట్టి చారిత్రిక గౌరవముగల యాంధ్రులకొరకు, ౧౩౩౧ ఫ. [క్రీ. శ. ౧౯౨౨] లో ప్రారంభించబడిన యుద్యమముయొక్క యాశయము, కార్యవిధానము, వెనుకటి ప్రకరణములలో జూపబడినంత పాటిదేనా? అంతకంటె విశాల దృక్పథము ఉద్యమ స్థాపకులకును, కార్యకర్తలకును లేకయే యుండెనా? భారత దేశములోని ఇతర ప్రాంతములను—ముఖ్యముగా మద్రాసు రాష్ట్రములోని ఆంధ్రదేశమును—ఆందోళన పరచుచుండిన భావ తరంగములు నిజాంరాష్ట్రాంధ్ర ప్రాంతములోని నాయకుల మానసముల కలవర పరచలేదా? రాజకీయ స్వాతంత్ర్యము, సంఘ సంస్కరణము, విద్యావిధాన పునర్నిర్మాణము మున్నగు గొప్ప సమస్యలు ఇచ్చట ఏల పొడచూపలేదు? ఇట్టిసమస్యలనుగురించి ప్రజాప్రబోధము సలుపవలసిన యవసరము కార్యకర్తలకు స్ఫురించనేలేదా? ఇటువంటి ప్రశ్నలు

పాఠకుల హృదయములందు ఉద్భవించుట సహజము. అయినను మన రాజ్యపు అప్పటి స్థితిగతులను సరిగా గ్రహించినచో ఇట్టి సందేహములు తొలగిపోగలవని నమ్ముచున్నాము.

౧౩౩౧ ఫ. [౧౯౨౨] అనగా, బ్రిటిషిండియాలో మాంటేగు చెమ్సుఫోర్డు రాజ్యాంగ సంస్కరణములు అమలులోనికి వచ్చి రెండేండ్లు గడచిన నాటి కాలము. ఆ సంస్కరణలను బట్టి అచ్చటి ప్రాంతీయ శాసన సభలు విశాలములయ్యెను. బాధ్యతాయుత ప్రభుత్వపు ఆదర్శము అంతకు ఏడేండ్లుముందే [౧౯౧౭లో] ప్రకటించబడి యుండెను. శాసన సభలకు, సంపూర్ణముగా గాకపోయినను, కొన్ని శాఖల మేర వరకు, ప్రభుత్వము బాధ్యతాయుతముగా చేయబడియుండెను. అనగా ద్వంద్వ పరిపాలనా విధానము అమలులోనికి వచ్చియుండెను. అట్టి కాలమున, నిజాంరాష్ట్ర ప్రజలందు రాజకీయ ప్రబోధము ఏమాత్రము లేదని ఒప్పుకొనక తప్పదు! ఒప్పుకొనునప్పుడు సిగ్గు తోపక మానదు!!

హైదరాబాదు నందు శాసన సభ యనునదొకటి ౧౩౦౩ [౧౮౯౪]లో స్థాపింపబడి యుండెను. ‡ కాని దానిలో

‡ దీనిలోని సభాసదుల సంఖ్య ౨౦ ఎన్నుకొనబడు సభ్యులు ౪ గురు. వీరిలో ఇద్దరు సంవత్సరమునకు ఆరువేల రూపాయల ఆదాయముగల జాగీరు

ప్రజలకు ఎట్టి ప్రాతినిధ్యము లేకయుండెను. ఈ శాసన సభకు చిత్తు శాసనములను చర్చించుటకు మించి, ఏ యధికార ములును లేవు. లార్డు రిపన్ వైసరాయిగా నున్న కాలము (౧౮౮౦-౧౮౮౪)లోనే, ఈ రాజ్యమునందును, అందరితో పాటు, స్థానిక స్వపరిపాలనా సంస్థలు ప్రారంభించబడెను. కాని వానిలో ఎచ్చటను సభ్యులను ఎన్నుకొను పద్ధతి ఇంకను మొదలుఅయి యుండలేదు. † నిజాం రాష్ట్రమున చదువు వచ్చినవారి సంఖ్య అప్పటికి నూటికి 3.3 కంటె మించియుండి లేదు. ఇట్టి స్థితిలో జనులందు ఏపాటి రాజకీయ చైతన్య ముండునో ఊహించుకొనుట సులభము. అట్లుండియు హైదరా బాదలోని విద్యాధికులగువారు ౧౩౩౦ ఫ॥ (౧౯౨౧) లో రాజధానీ నగరమున నొక రాజకీయ మహాసభను సమావేశ పరుప దలచగా, సర్వ ప్రయత్నములు పూర్తియైన తరువాత

---

దారుల వలన ఎన్నుకోబడెదరు. మిగిలిన ఇద్దరిని హైదరాబాదు రాజ్యము లోని హైకోర్టు వకీళ్లె ఎన్నుకొనెదరు. మన శాసన సభలో ప్రజలకు ప్రాతినిధ్యము ఇట్టిది!

† స్థానిక స్వపరిపాలనా సంస్థలు ప్రారంభించబడిన ఆ కాలమున ప్రభుత్వమువారు, ప్రజలలో తగినంత విజ్ఞానము కల్గిన తర్వాత, ఎన్నికల పద్ధతి ప్రవేశపెట్టెదమనిరి. అట్టి విజ్ఞానము ఇప్పటికి కలుగలేదని భావించ బడుచున్నది. ఇదెట్టి న్యాయమో?

మహా మేధా సంపన్నులగు ఇచ్చటి ప్రభుత్వమువారు వలదని నిషేధించిరి. అంతే కాదు, తరువాత కొలది దినములకే మహా ఘనతవహించిన నిజాము ప్రభువరేణ్యులు ఒక ఫర్మానును జారీచేసిరి. దానిలో, రాష్ట్రమునందెచ్చటనైనను రాజకీయ సభలుగాని, రాజకీయ పరిణామములను కల్పించునను అనుమానము కలిగించు సభలుగాని, ప్రభువుగారి యంగీకారము ముందుగా పొందనిది జరుగరాదనియు, అట్టి సభల కార్యక్రమ వివరములు, సభను సమావేశ పరచువారు, ప్రభుత్వసభకు, అనగా మంత్రిమండలము వారికి, ముందుగానే పంపుకొనవలసి యుండు ననియు విధించబడి యుండెను. విద్యాగంధ శూన్యులగు ప్రజలను, పైన వివరించబడిన వానివంటి ప్రభుత్వ సంస్థలును, రాజకీయ సభల విషయముననే కాక "రాజకీయ పరిణామములను కల్పించునను అనుమానము తోపజేయు సభల విషయమునను" ప్రభువుగారి ప్రత్యేక మగు అనుమతిని బడయుట విధాయకమై యుండగా, అప్పటి ఆంధ్రోద్యమ కార్యకర్తలు, ప్రజలలో రాజకీయ ప్రబోధము కలిగించు ప్రయత్నమును చేయ సాహసించ గలరా? ‡

---

* ప్రభుత్వమువారి అసాధారణ జరీదా (గెజెటు) 3 అబాన్ ౧330 ఫ. (౯-౯-౧౯౨౧)—చూడుడు.

‡ సభలవిషయమున ప్రభువుగారు అనుగ్రహించినఫర్మాను తరు

జనసామాన్యమునందు విజ్ఞానము అపరిమితముగా సన్నగిల్లి, ప్రపంచములోని యితర ప్రాంతములో ఏమి జరుగుచున్నదో గ్రామవాసులు ఏ మాత్రము తెలిసికొనజాలక హీనస్థితిలో నున్న చోటులందు, సంఘ సంస్కరణ సంబంధమగు ప్రబోధముగాని, ప్రచారముగాని ఎంత యుపయోగకారి కాగలదు? అంతేకాదు. అట్టి యుద్యమమువలన ప్రజలలో—విశేషముగా మూఢాచారములకు శతాబ్దములనుండి లోనై యున్న అమాయక ప్రజలలో—పరస్పర ద్వేష భావములు, చీలికలు కలిగి, ఉన్న స్థితియు చెడిపోవుట కెంతసేపు పట్టును? మత సంబంధములగు విషయములందు ప్రజలకు విజ్ఞానము కలిగించదలచినచో, ఈ రాష్ట్రములోని ప్రత్యేక ప్రభుత్వపరిస్థితులందు ఎట్టి చిక్కులకు కారణమేర్పడునో, సులభముగా గ్రహించవీలు కలదు! ధైర్యహీనులును, దుర్బలులునునై

---

వాత మరియొక యాజ్ఞ ప్రభుత్వమువారి గష్తీ నిషాన్ ౫౩ తేది ౧౪-౨-౧౩౩౮ ఫ. రూపమున, ఎనిమిదేండ్లు గడచిన మీదట, వచ్చినది. అప్పటి వరకు మన ఆంధ్రోద్యమముయొక్క మొదటిదశ పూర్తికావచ్చినది. ఈ గష్తీలోని విషయముల ననుసరించియే ప్రథమాంధ్ర మహాసభ (జోగిపేట) జరుపుటకు సెలవు పొందబడినది. ఈగష్తీవలన ప్రజల వాక్స్వాతంత్ర్యము, సమావేశ స్వాతంత్ర్యము మరింత అణగద్రొక్కబడినవి. దాని వివరములు, ఫలితములు, ఉద్యమముయొక్క రెండవ దశలో పాఠకులు చదువగలరు.

యున్న తెలంగాణా వాసులకు పైన చెప్పిన కార్యక్రమము
గల యుద్యమము ఏపాటిలాభము కలిగించగలదు ? ఇట్టి
స్థితిలో, నిజాంరాష్ట్రాంధ్రులందు స్వాభిమానమును, ఆంధ్రత్వ
భావమును పురికొలుప వలయు నన్న ఎట్టి కార్యక్రమము
సాధ్యమును, ఉపయోగకరమును అగునో నిర్ణయించుటకు
ఎంతో దూరదృష్టి అవసరమై యుండెనని తలంతుము. అట్టి
దూరదృష్టితో పని గొనియే ఉద్యమస్థాపకులును, కార్య
కర్తలును, వెనుకటి ప్రకరణమున చూపబడిన కార్యక్రమము
ఆ కాలమునకు చాలు ననుకొని యుందురు. అనగా, ఆంధ్ర
గ్రంథాలయ పఠన మందిరముల విరివిగా స్థాపించి మాతృ
భాషయెడ నభిమానము కల్పించి, ఆంధ్ర వాఙ్మయ వ్యాప్తికిని,
పత్రికా పఠనమునకును, రాజధానీ నగరమునుండి జిల్లాల,
తాలూకాల ప్రధాన స్థలములవరకే కాక పల్లెటూళ్లవరకును
మార్గ మేర్పరచుటయు, గ్రామస్థులగు సామాన్య ప్రజలకు
అచ్చటి అను దిన జీవితమునందు ప్రభుత్వోద్యోగుల వలన
కలుగుచుండు కష్టములనుండి విముక్తి కలిగించుటకై శక్తికొలది
యత్నించుటయు, ఉద్యమమునందు రాజకీయ లక్షణములు ఏ
మాత్రము కానరాకుండునట్లు తగినంత జాగరూకతతో పని
గొనుచుండుటయు, ప్రభుత్వము వారికిని అధికారులకును కార్య
కర్తలపై ఎట్టి అనుమానము కలుగకుండునట్లు వర్తించు

చుండుటయు ఉద్యమముయొక్క ప్రారంభ దశలో అనివార్య మైనది. నాయకులయొక్కయు; కార్యకర్తల యొక్కయు అత్యంతమగు జాగరూకతకూడ ఎట్లు నిరుపయోగమైనదో, దోషరహితమగు కార్యక్రమము కూడ ఎట్లు అడ్డగింపబడ సాగినదో, పాఠకులకు ముందు విదితము కాగలదు†

† ఇంతటి జాగరూకతతో, ఈ రాష్ట్రమునందు ఉద్యమము నిర్వహింపబడు చుండగా, కొందరు సోదరులు, ఈ యుద్యమము రాజకీయమైనదనియు, హిందూమత సంబంధమైనదనియు సూచించుచు పత్రికలలో వ్రాయించుచు నుండిరి. దీనివలన ప్రభుత్వాధికారుల అనుమానములకు మరింత బలముకలిగి ప్రధాన కార్యకర్తలు ఎన్నియో చిక్కుల నెదుర్కొనవలసినవారైరి. ఇట్టి కుత్సితములగు వ్రాతలలోని కొన్ని వాక్యములు ఈ క్రింద నుద్ధృతము చేయుచున్నాము.

"ఎప్పటికైనను, నిజాము రాజ్య ప్రజలకు హక్కులు వృద్ధిపొంది శాసనసభలు స్థాపితమగుచో, ఈ యాంధ్రజన సంఘము అట్టి విషయములలో ఐక్యము కలుగజేసి కొనవచ్చును. మరియు ఆంధ్ర హిందూ జనసంఘ సమ్మేళనమగుటచే ఎన్నటికైన మున్ముందు మత, సాంఘిక, రాజకీయ విషయములలో ఐక్యము కలుగజేసికొనవచ్చును...రాజకీయ, మతవిషయిక సాంఘిక విషయములందు పూర్తిగా సంబంధము లేకపోయినను, ఒక మాదిరిగా సంబంధముగల యీ యాంధ్రజన సంఘము... అగ్నికి కట్టెలకు ఎట్టి సంబంధమో, రాజకీయ, మతవిషయిక, సాంఘిక సంబంధమైన ఆంధ్ర జనసంఘమునకును, దీనికిని (గ్రంథాలయపరిశోధక సంఘములకు) అట్టి స్నేహం..." నీలగిరి వారపత్రిక నల్లగొండ(౯-౨-౧౩౩౮)ఫ. పుట ౪.

# తెలంగాణా ఆంధ్రోద్యమము.

## ౫
## గ్రంథాలయోద్యమము

ఆనాటి ఆంధ్రోద్యమ నిర్వాహకులకు గ్రంథాలయోద్యమము సులభమైనదిగ కాన్పించినట్లు తోచుచున్నది. అందునకు ప్రధానకారణము, నిజాం రాష్ట్రాంధ్రదేశమున ఆంధ్రోద్యమారంభమునకు పూర్వమే, మేము వెనుక సూచించినవిధమున గ్రంథాలయోద్యమము—పరిమితముగా కొన్ని స్థలములలోనే యగుగాక!—ఇంచుమించు ఇరువది సంవత్సరములనుండి సాగి వచ్చుచుండుటయే యని తలంతుము. ఆ యిరువది వత్సరములలో జరిగిన మాతృభాషాసేవ అప్పటియువకులలో కొంత యుత్సాహమును కలిగించియుండెను. అయినను, కొద్దిపాటి గ్రంథాలయములును ప్రభుత్వాధికారుల యనుమానమునకును, తీవ్రదృష్టికిని గురిగాక యుండలేదు. ఆంధ్రోద్యమ మారంభమగుటకు సుమారు ఒక సంవత్సరముముందు, నల్లగొండజిల్లాలోని సూర్యాపేటయందు అనేక సంవత్సరములనుండి పనిచేయుచుండిన ఆంధ్రవిజ్ఞాన ప్రకాశినీ గ్రంథాలయమును ఆ జిల్లా తాలూకుదారుగారు, తమ పర్యటన సందర్భమునవచ్చి చూచిరి ఈయధికారి మనరాజ్యములో జిల్లా లోకల్బండుసభకు అధ్యక్షు

---

ఇట్టి వ్యాసములు రెండు వచ్చినతరువాత, కేంద్రసంఘ కార్యదర్శి ఈ క్రింది సమాధానము ప్రకటించెను:—

పదవినికూడ నిర్వహించుచుండెను. ఇట్టి మహాశయునకు ఆంధ్ర గ్రంథాలయ మొకటి తాలూకా ప్రధాన స్థలములో, కేవలము ప్రజలసహాయమున, సాగుచుండుట దుస్సాకార్యమనిపించినది! "ఈ గ్రంథాలయమును స్థాపించుటకు ప్రభుత్వమువారి యంగీకారము పొందితిరా? లేదా?" యని స్థానిక కార్యకర్తలను వారుప్రశ్నించిరి. "లే"దని ప్రత్యుత్తరము వచ్చెను. ఇంకేమి కావలెను? ప్రభుత్వమువారి యంగీకారము పొందనిదే గ్రంథాలయమును తెరచితిరి. కనుక అట్టిఅంగీకారము పొందువరకు మూసియుంచుడని హుకుము ప్రసాదించిరి. శ్రీవారి యాజ్ఞనుల్లంఘించు ధైర్యమెవరికి కలుగును? కనుక గ్రంథాలయము మూతపడెను! శ్రీమద్రమారమణ గోవిందోహరి!

"...౧౨వ సంచికలో శ్రీయుతశర్మగారు, ఒకచోట ఆంధ్రజన సంఘములు హిందూజనసంఘ సమ్మేళనమగుటచే ఎన్నటికైన మున్ముందు రాజకీయ విషయములలో జోక్యము కలుగజేసికొనవచ్చును. అనియు, మరి యొకచోట, రాజకీయ మతవిషయములందు పూర్తిగా సంబంధము లేక పోయినను, ఒక మాదిరిగా సంబంధము ఈయాంధ్రజనసంఘములకు కలదని యు,మూడవచోట రాజకీయ మతవిషయిక సంబంధమైన ఆంధ్రజన సంఘములనియు వ్రాసియున్నారు. కేంద్రసంఘనియమములను సంఘ నివేదికలను చదివినవారికి ఆంధ్రజనసంఘములకు రాజకీయ మతవిషయములతో సంబంధము లేదని స్పష్టపడగలదు. ఈవిషయమున శ్రీయుత శర్మగారికిని వారి వ్యాసముల చదివిన పాఠకమహాశయులకును సంశయనివారణ మగునని నమ్ముచున్నాను. (నీలగిరి వారపత్రిక, నల్లగొండ ౨౩-౨-౧౩౩౮ ఫసలీ)

కార్యకర్తలు ఈ సంగతిని రాజధానీ నగరములోని యొకన్యాయవాదికి తెలియచేసిరి. అదృష్టవశమున ఆకాలమున, సుప్రసిద్ధుడగు సర్ అక్బర్ హైదరీగారు హోంసెక్రెటరీపదవిలో నుండిరి. ఆయన విచక్షణా జ్ఞానమునందు కొంత విశ్వాసముగల ఆన్యాయవాది గ్రంథాలయ దురంతమును వారికి వ్రాసిపంపిరి. దానిలో, "జిల్లాలోకల్ఫండుబోర్డు అధ్యక్షులు ఇతర దేశములలో ప్రజల గ్రంథాలయములకు ధనసహాయము చేయుచుండునని వినియుంటిని కాని గ్రంథాలయములను మూసివేయించెనని విన లేదు. ఈ విషయమున న్యాయము చేయవలయు" నని కోరగా హోంసెక్రెటరీగారు, న్యాయవాదికి "నేనీవిషయమును విచారింతు"నని వెంటనే తెలిపి, తాలూకుదారుగారినుండి జవాబు వచ్చిన

ఇట్లు సమాధానము వ్రాసినను, శ్రీయుత పాలకోదేటి వేంకటరామ శర్మగారు మరల రెండు వ్యాసములు, తమ వ్రాతలను మరింత బలపరచుచు తర్కవితర్కములతో ప్రకటించిరి.

ఆకాలమునందు, ఈ రాజ్యమున, నిట్టివ్రాతల పత్రికలలో ప్రకటించినవారి వర్తమునుగురించి మేము అభిప్రాయము ప్రకటించక ఆ కార్యమును పాఠక మహాశయులకే వదలెదము.

తరువాత శ్రీశర్మగారు తమ అభిప్రాయమును మార్చుకొని ఇట్లు వ్రాసిరి: "నేను మధిరయందు ఆంధ్రజనసంఘ సమావేశమును జూచి ఎంతయు తృప్తిచెంది పూర్తిగా నాయుద్దేశమును మార్చుకొంటిని. ఇప్పుడు ఈ సంఘమునుగూర్చి వేరభిప్రాయము గలవారుండరని నా నమ్మకము.

పిమ్మట న్యాయవాది * కిట్లు వ్రాసిరి. † "గ్రంథాలయముల స్థాపించుటకు ఈ కార్యాలయమునుండి (ప్రభుత్వము) ఆజ్ఞపొందవలసిన అవసరములేదు". ఈ పరిష్కారము జరిగిన తరువాత గ్రంథాలయము మరల తెరువబడి పని ఆరంభమైనది !

ఇది ఆంధ్రోద్యమారంభమునకు పూర్వపు సంఘటనము ! తరువాతి యుదంత మొకటి, ఉదాహరణార్థము, వినిపింతుము !

వరంగలు జిల్లాలోని మడికొండ గ్రామమునం దొక ఆంధ్రగ్రంథాలయము పనిచేయుచుండెను. గ్రామ పోలీసు పటేలు, గ్రంథాలయ కార్యదర్శి పేర, "గ్రంథాలయస్థాపనము చేయుటకు ప్రభుత్వమువారి అంగీకారము పొందవలసియుండెను, ఇప్పుడు అట్టి అంగీకారము పొందవలసిన"దని హుకుము పంపెను. "గ్రంథాలయ స్థాపనకు ఇట్టి అంగీకారము అవసరము లేదు. అంగీకారము కావలెనని ఏదైన హుకుము ఉన్నచో పంపినయెడల అమలుచేసెద"నని కార్యదర్శి బదులు వ్రాసెను. దానిపైన పోలీసుపటేలు ఎట్టి హుకుము ఆధారముగా చూపక

---

ఇక ముందు అందరు ఈ సంఘాభివృద్ధికి తోడ్పడవలసిన దేయని నా నమ్మకము.
(నీలగిరి; ౨౨-౬-౧౩౩౪ ఫ.)

* ఈ న్యాయవాది మాడపాటి హనుమంతరావు.

† మురాసిలా మహకమే మోతమది సర్కారె ఆలీ సేగె అదాలతు కోత్వాలీ, ఉమూరెఆమ్మా: నిషాన్ ౧౨౯౪ తేది ౮-౧౦-౧౩౨౯ ఫ. (౧౯౨౦) సేగెతాలీమాత్.

యే, ప్రభుత్వమువారి అంగీకారము కావలెనని పట్టుపట్టెను ! తరువాత, వరంగల్లుజిల్లా అదాలతు నాజింసా॥ "మరియొక హుకుము పంపువరకు గ్రంథాలయము మూసియుంచవలె"నని ఆజ్ఞాపించెను!* ఈ ఆజ్ఞ అక్రమమైనదని నగరములోని కేంద్ర సంఘ కార్యదర్శి అప్పటిహోంసెక్రెటరీగారికి వివరములు తెలుపుచు గ్రంథాలయ స్థాపనకు ప్రభుత్వమువారి ఆజ్ఞ అవసరము లేదని హుకుం ఇచ్చుటకై ప్రార్థించిరి. ♦దీనికి జవాబు గడచిన ౨౧ సంవత్సరముల కాలములో రానేలేదు! నాజింసా॥ దయామయులై ఎట్లో దాదాపు రెండునెలల తరువాత గ్రంథాలయమును మూసివేయుమను ఆజ్ఞను ఎత్తివేసికొనిరి. కాని తిరిగి ఆజ్ఞ అగువరకు సభలు చేయవలదని కార్యదర్శిని కఠిన

---

*నిషాన్ ౯౬ తేదీ ౧౨ మెహర్ ౧౩౩౩ ఫ.గల పై ఆజ్ఞలోని ఈ క్రింది తెలుగు వాక్యములు సారస్వత వినోదములుగాకూడ నున్నవి:— 'ప్రతిరోజు సదర్ లైబ్రరీకి పుస్తకములు చదువుకొన గలందులకు జనులు, వస్తూవున్నారు. మరిన్ని, ఆంధ్రపత్రిక, కృష్ణపత్రిక, ముషీరెదకన్ వగైరా పత్రికలు వస్తూవున్నవి. హాల్ సదరులైబ్రరీ ఖాయంచేయుటకు మీరురయే మహాకమానుంచి అయినా హుకుం పొందివున్నారా? లేదా? అగరు హుకుం పొందనట్లయితే ఫవురన్ పొందవలసినది. రెంకె అక్సరు మజహబీ వార్తలలో జగడాలు అవుతూ ప్రాణహానికూడా కలుగుతున్నది."

♦నిషాన్ ౩౪౬ తేది—౨౪-౧-౧౩౩౪ ఫ.

ముగా శాసించిరి! ‡

గ్రంథాలయోద్యమము విషయమున అధికారులు ఇట్టి అక్రమములగు ఆజ్ఞల నిచ్చుట వాడుకయందుండెనని చూపుటకై స్థాలీ పులాకన్యాయముగా పై యంశములు వివరింపబడినవి.

జిల్లాలలో—ముఖ్యముగా గ్రామాలలో—గ్రంథాలయ కార్యకర్తలకు, అచ్చటి ప్రభుత్వోద్యోగుల వలన—ముఖ్యముగా పోలీసువారివలన—కలిగిన, ఇప్పటికిని అప్పుడప్పుడు అరుదుగా కలుగుచున్న-కష్టములు ఇచ్చట వ్రాయబూనినచో గ్రంథవిస్తరమగును. గ్రంథాలయముల కార్యకర్తలయొక్కయు, వారికి సహాయము చేయువారి యొక్కయు పేళ్లు వ్రాసికొనుట, ఇట్టి సంస్థలకు "చందాల నియ్యవద్దని గ్రామస్థులను బెదరించుట; "ఈ సంస్థలు సర్కారువారికి విరోధమైనవి" యని ప్రజల భీతావహుల జేయుట; "ప్రభుత్వమువారి సెలవు పొందక గ్రంథాలయ మెట్లు స్థాపించితి"రని యడుగుట; కొద్దిపాటి కార్యకారిణీ సభలైనను పోలీసువారు వచ్చికూర్చుండుట; "చందాదారుల పట్టికలియ్యు" మని యడుగుట; "పుస్తకముల పట్టికచూచె"ద మని తీసుకొనుట; ఇట్టి యుపద్రవములు తల

‡ నిషాన్ ౫౯౩ తేది ౨౯ అబాన్ ౧౩౩౩ ఫ.

వెండ్రుకలన్ని మా యనుభవమున జరిగినవి! ఇట్టి యుదాహరణ మొకటి నల్లగొండ జిల్లాలోని సూర్యాపేటయందలి ఆంధ్రవిజ్ఞానప్రకాశినీగ్రంథాలయమున కాన్పించినది. సుమారు ఇరువది సంవత్సరములక్రింది మాట! జిల్లాపోలీసు అధికారి, సర్కిలుఇన్స్పెక్టరుతోను, తదితర పరిచరవర్గముతోను గ్రంథాలయమునకు వెళ్లి పరిశీలన సల్పి, చందావసూళ్ల రిజిష్టరు, ఆదాయవ్యయముల లెక్కల పుస్తకము మొదలగునవి కొన్ని తీసికొని—వారి యనుగ్రహమనవలెను!—దయతో నొకరసీదిచ్చి వెళ్లి, హైదరాబాదులోని పోలీసునాజముగారికి పంపిరట! ఈ యంశములు నగరములోని కేంద్రసంఘ కార్యదర్శికి తెలిసినవి. అయినను ఆయన ఏమియు చేయ నవసరము లేకయే, నగరములోని ఉన్నతాధికారులు, క్రిందియధికారులను కఠినముగా మందలించి "ముందిట్లు ప్రభుత్వగౌరవమునకు భంగము కలుగు పనులు చేయవల"దని హెచ్చరించి ఆరిజిష్టరులను మరల పంపివేయగా, సర్కిలు సాహెబుగారు వానిని గొనివచ్చి, గ్రంథాలయ కార్యదర్శి కప్పగించి, గ్రంథాలయము చేయుచున్న సేవ మంచిదనియు, ఏమైన ఇబ్బందులు కలిగినచో తెల్పిన పక్షమున తాము సహాయము చేసెదమనియు చాల మర్యాదగా మాట్లాడి వెళ్ళిపోయిరట!

ఇబ్బందులు కొన్ని కలుగుచున్నను, ఈ రాజ్యమున, తెలంగాణములో, గ్రంథాలయములు అనేకములు ఏర్పడినవి. ఉద్యమము ఆరంభమైన తరువాత, మొదటి దశలోనే ఇట్టి సంస్థలసంఖ్య నూటికి మించినది. ఈ గ్రంథాలయము లన్నియు గొప్పవిగా నుండెనని మేము అనజాలము; వానిలో అనేకములు చాలచిన్నవి. ఒక చిన్ని ఆలమారును నింపగలిగినన్ని పుస్తకములు, కొన్ని పత్రికలు మాత్రమే వాని సర్వస్వము. గ్రామములలో చదువువచ్చినవారి సంఖ్యయు చాల స్వల్పమే. నూటికి ముగ్గురు చదువు వచ్చినవారుగల రాజ్యములోని పల్లెటూళ్ళలో నిట్టి పుస్తక భాండాగారములు ఎట్లుండగలవో అవియు అట్లేయుండెను. అయినను, "గ్రంథాలయము" ఉండిన గ్రామములో, ఉత్సాహవంతుడగు యువక కార్యకర్త యొక డున్నాడనియు, ప్రజాహిత కార్యములం దభిరుచికి ఆతడే కేంద్రమై యుండుననియు, మా యనుభవమునుబట్టి గుర్తింపగలిగితిమి! అతడా గ్రామమం దుండునప్పుడు గ్రంథాలయము సజీవముగా నుండుటయు, అతడు గ్రామాంతరవాసి యగుట సంభవించినచో, ఆగ్రామములోని "గ్రంథాలయము" నశించుటయు, ఆతడు క్రొత్తగా నివాస మేర్పరచుకొనిన గ్రామమునందు, నూతనముగా నొక గ్రంథాలయమో, పఠనాలయమో ఆస్తిత్వములోనికి వచ్చుటయు తరచుగా గానవచ్చినది! ఇట్టి

పరిస్థితులకు కారణమేమి? గ్రామమంతటిలోను కార్యకర్తయు పాఠకుడును, ఉపన్యాసకుడును, పత్రికావిలేఖరియు, నాయకుడును— యిదియదియననేల?-సర్వమును అతడొకడేయైయుండుటయే ఇందునకు మూలకారణమని చెప్పవలయును. కొన్ని సమయములందు గ్రామములలోని ఇట్టివ్యక్తి కార్యకర్త తాను పరస్థానమునకు నివాసము మార్చుకొను నప్పుడు, స్థానిక గ్రంథాలయములోని పుస్తకములను, ఇతర పరికరములనుగూడ తనవెంట తీసికొనిపోవుటయు జరిగినదట ! దాని నరికట్టినవాడే యుండలేదట! వారు స్థాపించి, పెద్దజేసిన గ్రంథాలయము వారిసొత్తేయని వారు భావించిరి ! కాదనువారు లేరైరి! ఇక కావలసినదేమి? †

ఇంకొక గ్రంథాలయమున జరిగిన సంఘటనము, విచారకరమైనను, వినోదదాయక మనదగినది కలదు. అది యున్న చోటు తాలుకా ప్రధానస్థలము. ఆ సంస్థ కార్యకర్తలలో నొకరు—చాలగొప్పవారు—ఒకనాడు ఎవరును లేనప్పుడు కాబోలును, రెండునూర్ల రూపాయల విలువగల డెబ్బది ఉత్తమ

---

†ఇట్టి ఉదాహరణము ఏ చిన్న యూరిలోనో కాదు, వరంగల్లుజిల్లా లోని గొప్ప తాలూకాస్థలమున, మానుకోట (మహబూబాబాదు) లో కానవచ్చినది. స్థలాంతరమునకు బోయిన యా గ్రంథాలయముస్వస్థానమునకు మరల రానేలేదట !

గ్రంథములను గ్రంథాలయమునుండి తీసి బయటికెచ్చుటకో-ప్రభుత్వమువారు రాజకీయనాయకులను పంపినట్టు-ఆకస్మికముగా నంపివేసిరి. ఇతరులు, బాధ్యతగల కార్యకర్తలు వచ్చి, సంగతి తెలిసికొని పరితాపపడిరి. హైదరాబాదలోని కేంద్రసంఘ కార్యకర్తకు ఒకరు లేఖద్వారా సంగతి తెల్పిరి. ఆయన దోషియగు కార్యకర్త పేర—మనస్సునకు నాటు మాటలతో-లేఖ వ్రాసెను. తక్కిన కార్యకర్తలు ఎంతో కృషిచేసిరి. ప్రభుత్వాధికారులకుకూడ జరిగిన వార్తలు తెలిపెను. న్యాయస్థానమునకో రక్షక కార్యాలయమునకో క్రమపరచి జరుపబడు నంతటి స్థితి వచ్చెను. తుదకు దోషియగు మహానుభావుడు, తన తప్పితము నొప్పుకొని, రెండునూర్లరూపాయలు పదిదినములలో నిచ్చుగడవుతో, పత్రము వ్రాసియిచ్చెనట! తరువాత ద్రవ్యము చెల్లించెననియు, ఆద్రవ్యము, పోయిన పుస్తకములు తెప్పించుటకు వినియోగించబడెననియు మాకు తెలియవచ్చినది. మొత్తముమీద ఈ ఘటనము ప్రమోదాంతముగానే పరిణమించినది. ! అస్పృశ్యములైన పుస్తకములు కృష్ణానదిలో పడవేయ బడెనని.—కృష్ణార్పణ మైనవని—వింటిమి ! సత్యమదైవమునకెరుక ! ♦

---

♦ఇది పదునెనిమిద సంవత్సరములక్రింది ముచ్చట. ౧౩౪౦ ఫసలీ మధ్యభాగములోనిది. ఈ సంబంధమైన ఉత్తరములు కలవు. దోషియగు

## ఆంధ్ర గ్రంథాలయముల

### మొదటి మహాసభ

ఆంధ్రోద్యమము ఆరంభమైన తరువాత తెలంగాణ మందు అనేక ఆంధ్రగ్రంథాలయాలు ఏర్పడి శక్తికొలది పని చేయుచుండుట పైనచెప్పిన సంగతులవలన చదువరులకు తెలిసి యుండును. వేర్వేరు స్థలములం దీకార్యమును నిర్వహించు చున్నవారల నొకచోటకు తీసికొనివచ్చి, వారియందు పరస్పర సానుభూతి సహకారములు కలిగించి, గ్రంథాలయోద్యమాభి వృద్ధికి దారి ఏర్పరచు నుద్దేశముతో ఈ రాష్ట్రములోని గ్రంథాలయముల మహాసభ, ఆంధ్రజన కేంద్రసంఘముయొక్క మూడవ సమావేశముతోపాటు, అది జరిగిన మరునాడే, ౨౧-౫-౧౩౩౪ ఫ. (౨౨-౨-౧౯౨౫) నాడు వరంగల్లు జిల్లా లోని మధిరయందుజరిగినది. ఈ మహాసభకు సుప్రసిద్ధ సంపన్న ఆంధ్ర మహాశయులును, గౌరవ న్యాయాధీశులును నగు శ్రీ పింగిలి వేంకటరామా రెడ్డిగారు అధ్యక్షత వహించిరి. ఈ సంద ర్భమున తెలంగాణములోని అనేక గ్రంథాలయముల ప్రతినిధులు రాజధానీనగరమునుండి మొదలుపెట్టి పల్లెటూళ్ల వారి వరకు, చాలమందివచ్చి సభలో పాల్గొనిరి.

సోదరుడు తన పశ్చాత్తాపము క్రియాపూర్వకముగా ప్రకటించెను. స్థల నామము, దోషినామము బయట పెట్టుటకు మనసొప్పదు! ఇటీవల ఈయన చనిపోయెను. ఆయన ఆత్మకు శాంతికల్గుగాక !

సభాప్రారంభమున, శతావధానులు, విఖ్యాత పరిశోధకులు, దూపాటి వేంకట రమణాచార్యులుగారు రసవంతములగు పద్యములతో ఉద్యమ కార్యకర్తలను, గ్రంథాలయ నిర్వాహకులను, అధ్యక్షులను, నాయకులను ప్రశంసించిరి. శ్రీమాన మామళ్లై లక్ష్మణాచార్యులుగారు దివ్యములగు గీతములను స్వరచితమగు దండకమును సభాసదులకు శ్రోత్రగేయముగా పఠించిరి. ఇతరులును పద్యముల జదివి మాతృదేవతాసేవ యొనర్చిరి. కవిశేఖరులగు మామునూరు నాగభూషణరావు గారి ప్రబోధగీతములు హృదయాకర్షకముగా నుండినవి.

అధ్యక్షుల మహోపన్యాసము గంభీరముగనుండి, గ్రంథాలయోద్యమము యొక్క అవసరమును, మన రాష్ట్రము లోని తెలుగుదేశమున నది వ్యాప్తి చెందుచున్న విధమును, విశదీకరించుచు ప్రబోధదాయకమై యుండెను. పలువురు ఈ విషయమున మంచి యుపన్యాసములు సల్పిరి. ఆనాటి సాయంత్రమున అధ్యక్షులు ♦ ను ప్రతినిధులును కూడి, ముందు గ్రంథాలయోద్యమమును ఎక్కువ విశాలపరచు విధానము నాలోచించి కృషిసల్పుటకై ఒక ఉపసంఘము ఏర్పరచిరి. †

---

♦ వీరు ఇటీవల మంత్రి పదవి నలంకరించి యుండిరి.

† ఈ యుపసంఘము తరువాత ఎక్కువగా పని ఏదియు చేసినట్లు కానరాదు.

## రెండవ మహాసభ

తెలంగాణములోని గ్రంథాలయముల రెండవ మహాసభ, కేంద్రసంఘము యొక్క నాల్గవ సమావేశముతో బాటు సూర్యాపేటలో ౧౭, ౧౮, ౧౯, అమర్దాదు ౧౩౩౫ ఫ. ౨౨,౨౩,౨౪,జూన్ ౧౯౨౬) తేదులలో జరుగవలయునని ఉద్దేశింపబడెను. ఆహ్వానసంఘ మేర్పడినది. ప్రకటనలు జరిగినవి. ఆ సందర్భమున ఇంకను ఎన్నియో సభలు జరుగునన్నాహములు చేయబడెను. ‡ నిజాము ప్రభుత్వము వారి వ్యవసాయ శాఖయొక్కయు, పశువైద్యశాఖయొక్కయు, సహకార శాఖ యొక్కయు, ప్రదర్శనములును, ప్రచారమును జరుపుటకై ఆయాశాఖలవారిని ఆహ్వాన సంఘమువారు ప్రార్థించిరి. † కాని

---

‡ సూర్యాపేటలో జరుగునని ప్రకటింపబడిన సభలు:—

౧. ఆంధ్రజన కేంద్రసంఘ చతుర్థసమావేశము: అధ్య: రావు బహదరు వేంకటరెడ్డిగారు.

౨. గ్రంథాలయ మహాసభ: అధ్య: శ్రీపింగిలి వేంకటరామారెడ్డిగారు.

౩. స్త్రీల సభ: అధ్యక్షురాలు, శ్రీమతి నడింపల్లి సుందరమ్మగారు.

౪. వర్తకసంఘ (సూర్యాపేట) వార్షికోత్సవము.

౫. గ్రంథాలయ (సూర్యాపేట) వార్షికోత్సవము.

౬. వ్యవసాయసభ (గోలకొండ పత్రిక ౩౧ తీర్ ౧౩౩౫ ఫ. ౫ జూన్ ౧౯౨౬)

† ప్రభుత్వమువారి సహకార సంఘమునకు సంబంధించిన ప్రచార

ప్రభుత్వము వారు సభలు చేయవలదని కార్యకర్తలకు నోటీసులు పంపి సభల నాపుచేయించిరి. ఈ సందర్భమున జరుగనున్న రెండవ గ్రంథాలయ మహాసభకు కూడ శ్రీ పింగిలి వేంకట రామరెడ్డిగారే అధ్యక్షులుగా నుండ నంగీకరించిరి. వారి అధ్యక్షోపన్యాసము సహితము ముద్రితమై యుండెను. కాని సభ లన్నియు ఆగిపోయి నందున ఈ విషయమున కోరికలు నెర వేరలేదు.

తరువాత దాదాపు రెండు సంవత్సరములు గడచిపోయి నవి. అహ్వానసంఘము వారు పట్టుదలవదలక, తీవ్రముగా కృషి సల్పి ప్రభుత్వ సభ (బాబెహాకూమతు) వరకు వ్యవహారము జరి పించిరి. ఈ మధ్యకాలమున పూర్వముండిన పోలీసు శాఖా మంత్రి ఉద్యోగవిముక్తి గాంచినందున, ఆంగ్లమహాశయుడు ఆ

---

క్షుడు సభాదినమున వచ్చి ఉపన్యసించెదనని పట్టుపట్టెనట. పోలీసు అధికా రులు 'మాపైఅధికారులు సభలు చేయవలదని నిషేధించినారు. కనుక మీరు సభచేయగూడ" దని పట్టుబట్టిరట! 'పోలీసు అధికారుల ఆజ్ఞకునేను బద్ధుడను కావలెను. ప్రభుత్వము వారి సహకార శాఖవారు నన్ను పంపి నారు కనుక నేను ఉపన్యాసము చేయక మాన' నని ప్రచారకుడు వాదించి సూర్యాపేటలోని ఒక బహిరంగ స్థలమున ప్రజలందరను రప్పించి ఉపన్య సించి తీరెనట! ఈవిధముగా ప్రభుత్వము వారి రెండు భిన్న శాఖల ప్రతినిధులు తమతమ పంతము నెగ్గవలెనని పోరాడిరి. అందులో నొకరు గెల్చిరి; ఒక రోడిరి. ప్రజల సభలు మాత్రము ఆగిపోయినవి.

మంత్రిపదవియం దుండుట సంభవించెను. ఆయన దయవలన సూర్యాపేటసభలకు—వానిలో నొకటగు గ్రంథాలయ మహాసభకుకూడ—ప్రభుత్వమువారి ఆజ్ఞ లభించినది. (౨౬-౨౭ తీరు ౧౩౫౮ ఫ. = ౩౧-౫ మరియు ౧-౬-౧౯౪౯)

ఈ మహాసభ ♦ సుప్రసిద్ధ రాష్ట్రనాయకుడును దాతయనదగు దేశభక్త వామననాయకు జాగీర్దారుగారి యధ్యక్షతతో జయప్రదముగా సమావేశమైనది. మొదటి దినము సాయంత్రమున అధ్యక్షోపన్యాసము హిందీభాషలో జదువబడినది. ఆ రాత్రి, మహాసభకు వచ్చిన ౨౯ గ్రంథాలయముల ప్రతినిధులతో, విషయనిర్ణాయకసభ ఏర్పడి కర్తవ్యము నిర్వహించినది. మరునాడు మహాసభాకార్యములు దివ్యముగా జరిగినవి. గ్రంథాలయోద్యమమునకు ముఖ్యములగు ౧౫ తీర్మానములు అంగీకరింపబడినవి. అధ్యక్షుని ఉపసంహారోపన్యాసము

---

♦ వామననాయకుగారీ మండువేసవిలో, ఆనాటి సభకు పశ్చిమ సముద్ర తీరముననున్న గోవానగరమునుండి వెడలి, హైదరాబాదు వచ్చి, వెంటనే మోటారుబండిలో హుటాహుటిగా ప్రయాణము సాగించి, ౨౯ తీరునాడు మిట్టమధ్యాహ్నమున ఒంటిగంటవేళ సూర్యాపేటకు వచ్చి, ఆ సభను రెండుదినములవరకు జయప్రదముగా జరిపిరి. ఆంధ్రోద్యమవ్యాప్తికై వేతనముమీద ప్రచారకుని నియోగించుటకు నెలకిరువది యైదు రూపాయల చొప్పున సంవత్సరముకొరకు రు|| ౩౦౦ లు విరాళమిచ్చిరి, ఇది ఉద్యమవ్యాప్తికి అమితముగ తోడ్పడినది.

తెనుగున ప్రోత్సాహకరముగా నుండెను. శ్రీ వానమామలై లక్ష్మణాచార్యులవారు దేశభక్త వామననాయకునకు విజయమును గోరుచు పాడిన మంగళగీతము "దేశభక్త, ఈశ్వరభక్త వామన్నాయక జై" అనునది మాకు ఇప్పటికి జ్ఞప్తియందున్నది!

తెలంగాణమున నిజాంరాష్ట్ర ఆంధ్రగ్రంథాలయ మహాసభ ప్రత్యేకముగా మరల జరుగలేదు. అయినను గ్రంథాలయోద్యమము మాత్రము నేటికిని సాగివచ్చుచునే యున్నది!



# తెలంగాణా ఆంధ్రోద్యమము.

## ౬

### వర్తకసంఘములు.

నిజాంరాష్ట్రములోని ఆంధ్రోద్యమముయొక్క మొదటి దశయందు ఆ యుద్యమమునకు తెలంగాణమునం దంతటను గాకపోయినను కొన్ని జిల్లాలలో—ముఖ్యముగా నల్లగొండ జిల్లాయందు—ప్రజామోదమును సంపాదించి ఉద్యమాభివృద్ధికి ఎక్కువతోడ్పడినది, వర్తకసంఘముల స్థాపనయనుట నిస్సంశయము.

"వర్తకసంఘము" అనుమాటవిని అదిదేశముయొక్క వాణిజ్యాభివృద్ధికై లేవనెత్తబడిన ఏదో గొప్పకార్యము అని పాఠకులు భ్రమపడకూడదు. ఈ సంఘములు చాలచిన్నవి. వాని కార్యక్షేత్రము కేవలము స్థానికము. వాని రంగములు గ్రామములు. అంతకు మించినచో, తాలూకాస్థలములు; అంతే. జిల్లాస్థలములవరకైనను అవి వ్యాపింపలేదు. అట్టి అవసరమే లేక యుండెనని తోచుచున్నది.

ఇట్టి వర్తక సంఘములను స్థాపించవలసిన అవసరమే యేలకలిగెనను ప్రశ్న స్ఫురించవచ్చును. తెలంగాణములో గ్రామములందును, బస్తీలందును, వర్తకవ్యాపారము చేయు

వారు వైశ్యులు. మార్వాడీలు చాలతక్కువ. కోమట్లు పూర్వ కాలము నుండి ఆంధ్రుల సంఘమున ప్రాముఖ్యము వహించిన వారను సంగతి అందరెరిగినదే. గ్రామములందు వీరుండనిచో ఎవరికి పని సాగజాలదు. పూర్వకాలము నుండి ఈ యంశము సుప్రసిద్ధము: "పురికిని ప్రాణము కోమటి" యని సుమతి శతక కర్త వ్రాసినమాటను ఎరుగనివారెవరుందురు? "అప్పిచ్చువాడు" ఉండని గ్రామములో ప్రవేశించనే గూడదని ఆ శతక కారుడే నుడివియున్నాడు. అట్టివారగు కోమట్లు తెలంగాణము నందు సంఘమున కంతటికిని ఉపయోగకారులయ్యు, అదైర్యము వలనను, విద్యాహీనత వలనను, కొన్ని చిక్కులకు లోనైరి.

వీరికి కలుగుచుండిన కష్టములు ఇవి: (౧) గ్రామము నకుగాని, కస్బాకుగాని ప్రభుత్వమువారి ఉద్యోగస్థులు పర్యటన మునకు వచ్చినప్పుడు, వారికి కోమటి భోజన పదార్థములను సప్లై చేయువలయును; కాని వాని ఖరీదు అసలే అతనికి చెల్లించకపోవుడమో, చెల్లించినను చాలతక్కువగా చెల్లించుటయో జరుగుచుండెను. ఈ విధముగా అవసరమగు వస్తువులకొరకు-- అట్టి ఉద్యోగికాక — గ్రామాధికారియగు పట్వారీ చీటి వ్రాయును. కనుక, ఉద్యోగిపైన జవాబుదారీ పడుటకు వీలు లేక యుండెను. (౨) పర్యటన సమయములలోనే కాక, ఇతర

సమయములందును తహస్సిలు కచేరీనుండి "తాకీదులు" గాని ఉత్తరములుగాని గ్రామాధికారులకు పంపి బియ్యము, నెయ్యి మొదలగు వస్తువులు అధికారులు చౌకధరలకు తెప్పించుకొను చుండిరి. (3) గొప్ప అధికారులు—సైనిక సంబంధమైనవా రైనను సరే, సైనికేతరులైనను సరియే—గ్రామములకు వచ్చి క్యాంపు (మకాము) చేసినప్పుడు, గ్రామపు కోమటి తన దుకాణమును తీసుకొని క్యాంపువద్ద ఉండి, కావలసిన వస్తువులనన్నిటిని సప్లై చేయవలసి యుండెను. అట్టి వస్తువులు గ్రామములలో దొరుకునా దొరకవా యనియైనను అధికారులు చూడకుండిరి. ఎట్లైనను అవస్థపడి పదార్థములు సప్లైచేయుటయు, వానిఖరీదు అసలే దొరకక పోవుటయో, చాల కొద్దిగా (నామమాత్రము) దొరుకుటయో సంభవించుటయే కాక, వృథాశ్రమ, అవమానము, కొట్లుతిట్లుకూడ అతనికి సంప్రాప్తమగుచుండెను. (4) కోమట్ల వద్ద బండ్లుఉండినచో — వానిమీద సరకుల నింపియున్నను సరే—ఈఉద్యోగస్థులకు కావలసినప్పుడుబలవంతముగాబండ్లను సర్కారుపనియని లాగికొనిపోవుట సర్వసామాన్యముగా జరుగు చుండెను. (5) సర్కారు అధికారులు వస్తువులధరలు తామే నిర్ణయించి అట్టిధరకే విక్రయించవలెనని వర్తకుల నిర్బంధ పరచుచుండిరి. (6) ఇట్టి కష్టములు కోమట్లు ప్రభుత్వాధికారుల, ప్రభుత్వోద్యోగుల వలననే కాక, గ్రామములోనుండు

దేశముఖు దేశపాండ్యాలవలనను, కొంతవరకు గ్రామాధికారుల వలనకూడ సంభవించుచుండెను. ఇట్టిబాధలను ద్రవ్యనష్టములను వారు అనివార్యములుగా భావించుకొని వీనిని అందరును సమానముగా అనుభవించుటకుగాను "వంతుపద్ధతి" యను దానిని ఏర్పరచుకొనుచుండిరి. ప్రతిదినము గ్రామములోని ఏదోయొక కోమటి యింటివారిది వంతుగానుండును. ఆనాడు వచ్చునట్టి పైవిధమైన కష్టనష్టములను అతడు భరించవలసినవాడగుచుండెను. ఇట్టి వంతుపద్ధతి నల్లగొండజిల్లా కోమట్లకు ఎంతో దుర్భరముగానుండెను. కొన్ని గ్రామములవారు, ఈ వంతుపద్ధతికి మారుగా నష్టమును భరించుటకు ఇంకొక సమిష్టి పద్ధతి నవలంబించిరి. అదెట్లనగా:—గ్రామములోని వర్తకులందరు కలిసి ఒక దుకాణమును ప్రత్యేకముగా నెలకొల్పి దానిద్వారా ప్రభుత్వోద్యోగులు మొదలగువారికి వస్తువులు సప్లైచేయు ఏర్పాటుచేసి, సంవత్సరమునకు దానివలన కలుగు నష్టములను అందరును భాగించుకొనుచుండుట. ఎట్లైననేమి? కోమట్లకు ధననష్టములు, బాధలు తప్పవయ్యెను. తాలూకా ప్రధానస్థలములలోగూడ ఇట్టి అక్రమ బాధలనుండి వారికి విముక్తి లేకపోయెను!

ఆంధ్రోద్యమ మారంభమైన కొలది దినములకే, ఎట్లెట్లో వర్తకులకు ఇట్టి బాధలనుండి తప్పించుకొను ఉపా

యము వెదుకవలయునని యాతురతకలిగెను. ఇట్టి యుద్దేశము తెలంగాణములో—అందును, నల్లగొండజిల్లాలో — మొట్టమొదట సూర్యాపేట వర్తకులకు కలిగినదని మాకు జ్ఞప్తి కలదు. ఈకార్యమునందు అచ్చటి ప్రభుత్వ పాఠశాలలో నుపాధ్యాయుడుగా నుండిన (కీ. శే.) పువ్వాడ వేంకటప్పయ్యగారు వారికి సర్వవిధముల ప్రోత్సాహము కలిగించిరట! మొత్తముమీద అంతకుపూర్వమున్న ఆచారమును తప్పించుటకై "వర్తకసంఘ"మను దానిని స్థాపించుకొనుటయు, ఉద్యోగుల దుస్తంత్రములను ప్రతిఘటించుటయుఅవసరమని సూర్యాపేటవర్తకులు నిశ్చయించుకొనిరి. అట్టివారిలో శ్రీయుత యామాఅరవయ్య, భోనగిరి శంభయ్య, భోనగిరి లక్ష్మయ్య లాభిసెట్టి లింగన్నగార్లును, కోమట్లుకాకపోయినను, బట్టలవర్తకులగు మహేంద్రకరు అంబాజీ పెద్దోజీగారును ఈ కార్యమున ముఖ్యపాత్రముల వహించిరి. వీరందరి సంకల్పములకు స్థానికులగు ఇతర పెద్దలయొక్కయు న్యాయవాదులయొక్కయు ఆలోచనలు తోడ్పడగా, దుందుభి సం॥ మార్గశిర శు॥ ౧౩, శనివారమునాడు "సూర్యాపేట వర్తకసంఘము" స్థాపితమయ్యెను.(౨౮-౨-౧౩౩౨ ఫ=౨-౧౨-౧౯౨౨) ఈసంఘపు నియమావళి హైదరాబాదులోని ఆంధ్రోద్యమ కార్యకర్తల సహాయముతో పూర్తియై, ప్రకటించబడెను. సూర్యాపేటలోని



ఆంధ్రజన కేంద్రసంఘ తృతీయ సమావేశము – మధిర.

వర్తకసంఘము మరియు దాని నియమావళియే నల్లగొండ జిల్లాలోని అనేక వర్తకసంఘములకు మార్గదర్శకమై, అనేక గ్రామములలోని వర్తకులను చిరకాలమునుండి పీడించుచున్న అవమానమునుండియు నష్టములనుండియు అవలీలగా విముక్తి కలిగించెననుట మాకత్యంతాశ్చర్యము కలిగించినది !

గ్రామవర్తకులకు లాభదాయకమైనట్టి ఈ యుద్యమమున ముందంజవేసిన సూర్యాపేట వర్తకసంఘమువారికి, కీర్తిగౌరవములతోపాటు అనేక చిక్కులుగూడ కలిగినవి. ఎంతోకాలమునుండి ద్రవ్యలాభమును, ఇతర అనుకూలములను అనుభవించుచుండినవారికి ఈ క్రొత్తపద్ధతి చాల మనస్తాపము కలిగించెను. అధికారము కలవారి మనసులకు నొప్పి కలిగినప్పుడు వారు ఊరకుండుట మానవస్వభావమునకు విరుద్ధము కదా! సూర్యాపేట వర్తకులకుకూడ బాధలు తప్పలేదు. అయినను వారు ధైర్యముతో నిలువబడి గట్టెక్కిరి. తరువాత ఇతర గ్రామములవారికి అట్టి కష్టముల నెదుర్కొనవలసిన పని కలుగలేదు. "మాగ్రామమున వర్తకసంఘము స్థాపితమైనది" అను ఒక వాక్యము మహామంత్రముగా పనిచేసి, ప్రభుత్వోద్యోగులను నిరుత్తరులుగా జేసినది! ♦

♦ నల్లగొండ జిల్లాలోని ఎన్నియో గ్రామములందు వర్తకులకు ప్రభుత్వోద్యోగులవలన అనుదినము కలుగుచుండు కష్టములను వివరించు

వర్తకులకు ప్రభుత్వాధికారులవలన కలుగుచున్న యిబ్బందులను చూచినతరువాత వర్తకుల స్వాతంత్ర్యమును నిరోధించు విషయమున మహా ఘనతవహించిన ప్రభుత్వము వారి ఆజ్ఞలు నిజముగ నిల్చియున్నవా? లోపము ఆజ్ఞలలో

---

పత్ర వ్యవహారములు కేంద్రసంఘ కార్యాలయమున నున్నవి. అట్టి లేఖలను నివేదికలను చదివిన ఒడలు జలదరించక మానదు. అధికారులకు, ఉద్యోగులకు పదార్థములు ఉచితముగానో, విపరీతముగ తక్కువధరలకో, ఇచ్చుటకై నిర్బంధింపబడుటవలన పల్లెటూళ్ళ వర్తకులు ఎంతో బాధకు కష్టమునకు లోనగుచుండిరి. ఇది వ్రాయునప్పుడు మాఎదుట మిర్యాలగూడెం తాలూకాలోని యొక గ్రామపు వర్తకుల కరారునామా కలదు. ఆగ్రామములో అధికారులు, ఉద్యోగులు దౌరాకు వచ్చునపుడును ఇతర సందర్భములందును పదార్థములు తెప్పించుకొనుటవలన కలుగు నష్టము సంవత్సరమునకు రు|| ౧౨౦౦ అని అందాజా చేయబడినది. ఆలెక్కచొప్పున మూడేండ్లకగు ద్రవ్యము రు 3,౬౦౦లు ఇచ్చి ఒక ప్రత్యేక దుకాణమును ఒక వర్తకునితో ఇతర వర్తకులు అందరు కలసి పెట్టించి తమలో ప్రతియొక్కనికి విడివిడిగా కలుగుచుండు బాధలను తప్పించుకొను ఉపాయమును పన్నినట్లు స్పష్టపడుచున్నది. ఇది ఎంత విచారకరమో ఊహించవచ్చును!

అనేక గ్రామములలో వర్తకసంఘములు నెలకొల్పి స్థానిక వర్తకులకు కష్టములను కేంద్రసంఘ సహాయముననను కేంద్రసంఘపు పలుకుబడివలనను తప్పించిన గౌరవము కేంద్రసంఘ ప్రచారకుడగు శ్రీ ఉన్నవ వెంకటరామయ్యగారికి చెందుచున్నది పైన ఉల్లేఖింపబడిన కరారునామ ౨౯ బహమన్ ౧౩౩౭ ఫసలి (౭ జనవరి ౧౯౨౮) నాడు వ్రాసికొనినది. ఆ కరారునామాలోని వివరములు ఆశ్చర్యమును,విచారమును పురికొల్పగలవి. గ్రంథవిస్తర భీతిచే వదలబడినవి!

గలదా? అమలులో గలదా? యని విచారణ జరుపవలసిన అవస
రము ఉద్యమ కార్యకర్తలకు స్ఫురించెను. అందుపైన కేంద్ర
సంఘము పక్షమున "వర్తక స్వాతంత్ర్యము" అనునొక లఘు
పుస్తకము ప్రకటింపబడి, అణా వెలకు విక్రయింపబడసాగెను.
ఈ పుస్తకముయొక్క మొట్టమొదటి ముద్రణము నల్లగొండ
జిల్లాలోని తిప్పర్తి గ్రామపు సభల (౧౮-౫ ౧౩౩౮=
౧౫-౨-౧౯౨౯) నాటికి సిద్ధమైనది ♦ ఆ కాలమున గ్రామ
వర్తకులకు ఈ పుస్తకము ఎంత యుపయోగకారి యైనదో
తెలిసికొనుటకు, దీని ముద్రణములు నాలుగుమారులు వేల
సంఖ్యలో జరిగినవను నంశము చాలును!

నల్లగొండలోని వర్తకులందు, ఈ పుస్తకమువలనను
ఇతర ప్రచారమువలనను, మంచి ప్రబోధ మేర్పడినది. వారి
కష్టములు అన్నియు తొలగినవని చెప్పగలము. బహుశః ఆకార
ణములవలననే, ఆ జిల్లాలో స్థాపితములైన వర్తకసంఘము

---

♦ తెలంగాణా వర్తకులకు గొప్ప యుపకారము చేసిన ఈ లఘు
పుస్తకమును, విఖ్యాతఆంధ్రనాయకులును, ఏడవ ఆంధ్రమహాసభాధ్యక్షులును
నగు శ్రీమందుముల రామచంద్రరావు, హైకోర్టువకీలుగారు, చాలశ్రమతో
ఉర్దూలోను, తెలుగులోను, సిద్ధపరచియుండిరి. వారిఈసేవప్రశంసార్హము.
మొదటి ముద్రణమున కయినవ్యయములను తిప్పర్తిలో సభలు జరిపించిన
వర్తక శ్రేష్ఠుడగు శ్రీ పబ్బతి యెల్లయ్యగారే భరించినట్లు జ్ఞాపకము.

ఉన్నియు అస్తమించినవి. కొన్ని స్థలములలో అవి నామ మాత్రములుగా నున్నవి. పని ఏమియు చేయుటలేదు. ఉన్న చోట్ల అవి గ్రంథాలయములకు కొంత ద్రవ్యసహాయము చేయుచున్నట్లు వినియున్నాము. ఏకార్యమునకై అవి వెడలినవో ఆకార్యము నెరవేరినది! లాభములేనిపనిఎంతకాలము సాగును? ఇందుకు సూర్యాపేట వర్తకసంఘమేసాక్షి యని జనులు చెప్పుకొనెదరు.! *



* అయినను, సూర్యాపేట వర్తకసంఘమువారు ఇటీవల పెద్ద మొత్తములు, దేశాభ్యుదయ కార్యములకు ఇచ్చియున్నారు. ఇంత కాలమునుండి స్థిరముగానున్న ఈసంఘముయొక్క రజతోత్సవము జరుగుట యోగ్యము. మా. హ.

# తెలంగాణా ఆంధ్రోద్యమము

## ౭

### వెట్టిచాకిరి

ఆంధ్రోద్యమపు ప్రథమదశయందు, గ్రామములలో వెట్టిచాకిరి చేయుచు పలు కష్టములు అనుభవించుచుండునట్టి నోరులేని ప్రజలందు కొంతప్రబోధము కలిగినదని చెప్పుటకు సంశయములేదు. ఈ పని వర్తకుల విషయమున ఎంతత్వరలో లాభప్రదమై వారి కష్టముల నివారించుటలో జయము గాంచినదో, దానిలో శతాంశమైనను, పాపము, ఈ పేదవారి విషయమున కాలేదనియు, జయముకాంచలేదనియు విచారముతో ఒప్పుకొనవలసియున్నది. దీనికి కారణములు ఎక్కువ వివరముగా నుడువ బనిలేదు. యదార్థమేమనగా, వర్తకుల కష్టములు చాల కొలది; అత్యంత పరిమితములు. కనుక వారి కష్టములు అవలీలగా తీరగల్గినవి. వెట్టిచాకిరివారి యిబ్బందులు చిరకాలాగతములు. అతి విశాలములు. అతి దీర్ఘములు. కనుకనే, నేటికిని తీరలేదు. ఇంకను ఎంతో కాలమువరకు తీరజాలవు. అయినను, వీరికొరకు జరిగిన కొలది సేవయు ఫలదాయకమే యైనదని చెప్పవలయును.

తెలంగాణములోని గ్రామములందు వెట్టిచాకిరి చాల బాధాకరమైనది. పూర్వము గ్రామములు కట్టించబడిన నాటి

నుండియు, గ్రామములందు నివసించు వివిధ వృత్తుల వారలకు యినాంభూములు ఇయ్యబడినవి. ఇట్టివి అనేక కులములవారు వంశపారంపర్యముగా అనుభవించుచున్నారు. మన రాజ్యమున అట్టివారిని "బలోతాదారు" లని పేర్కొనెదరు. వారనుభవించు యినాం భూములకు "బల్లోతా యినాం" ♦ లని పేరు. వీరిలో గ్రామ పారిశ్రామికులగు వడ్ల, కమ్మరివారును, పనివాండ్రగు చాకలి, మంగలి, మాదిగ, మాలవారలును చేరియున్నారు. ఇట్టివారందరితోను ప్రతిఫల మేమియు ఇయ్యకయే పని తీసుకొనుట, గ్రామమునకు పర్యటనపై వచ్చు సర్కారు ఉద్యోగులకును, అధికారులకును మాత్రమే కాక సర్కారి చప్రాసీలకును, ముందు చప్రాసీ ఉద్యోగమును సంపాదించగల మనుకొను ఉమీదువారులకును, గ్రామాధికారులగు పటేలు పట్వారీలకును, దేశముఖు దేశపాండ్యాలకును అలవాటైపోయినది. అంతేకాదు, వారు ఆ విధముగా పని చేయుటకు బద్ధులై యున్నారనియు వారికియ్యబడు ఇనాము భూములు ఇట్టిసేవ చేయుట కేయనియు అభిప్రాయ మేర్పడిపోయినది.

---

♦ "బలోతా" ఇనాం అనగా మాదిగ, మాల చమార్లకును, పారిశ్రామికులకును గ్రామములలో ఉండి గ్రామపు అక్కరలను తీర్చుటకు గాను సర్కారువారివలన అనుగ్రహించబడిన ఇనాం భూమి అని అర్థము: (నియమము ౨. ఆ "దారా" చేయు అధికారుల సర్బరాహి నియమములు.)

ఇందువలన అట్టి బీదవారికి కలుగుచున్న ఇబ్బందులు, నిజముగా హృదయము అనునది ఏమూలనైనను కలవారికి, దుఃఖదాయకముగా నుండకమానదు!

ఇట్టి వెట్టిచాకిరి నోరులేని పేదలతో తీసుకొనబడుచున్నదను సంగతి అందరికి విదితమే. తుదకు మహా ఘనతవహించిన నిజాం ప్రభువర్యులకును బాగుగాదెలియును. కనుకనే వారు తమ ఒకానొక జన్మదినోత్సవ సందర్భములో(౧౫-౬-౧౩౩౨ ఫ.=౨౦-౨-౧౯౨౩ నాడు) "ఈ రాజ్యములో ఇదివరకుండిన వెట్టిచాకిరి పద్ధతిని ... పూర్తిగా ఆపివేయుచున్నాను ... దీని వలన ప్రజలకు చాల కష్టముగా ఉన్నది. ఈ ఆజ్ఞను ఎవడు అతిక్రమించునో, అట్టివాడు శిక్షకు పాత్రుడగును" అని శాసించిరి. ♦ కాని దానిని అమలు జరుపుటలో అధికారులు కొంత ఆలంకము కలిగించిరి. తుదకు ప్రభువుగారి యాజ్ఞను మరల పొంది, (౪-౩-౧౩౩౬ ఫ.=౧౨-౧౨-౧౯౨౬) ఈ విషయమున నొక నియమావళి మాల్గుజారి మహకమానుండి జారీజేయబడినది: (నిషాన్ ౭ తేది ౬-౪-౧౩౩౭=౫-౧-౧౯౨౭) అనగా నేమి? ఫర్మాను వెడలిననాటికి, నియమావళి

---

♦ మ. ఘ. వ. ప్రభువుగారి ఫర్మాను: ౧ షాబాను ౧౩౪౧ హిజ్రి (మనప్రభువుగారు తమ ఫర్మానులకు హిజ్రి శకపు తారీఖువేయుచుందురు. దీనికి సమానమగు ఫసలీ తారీఖుపైన చెప్పబడినది.)

తరువాతనే ప్రకటింపబడినాటికి, నడుమ దాదాపు నాలుగేండ్లు గడచినవి! మన రాజ్యపు పాలనావిధానములో ఇట్టి యాల స్యము అంత గొప్పదికాదు. అది యట్లుండనిండు!

ఈ నియమావళి ప్రకారము (౧) వెనుకటి హుకుము లన్నియు రద్దుచేయబడినవి. (౨) వెట్టిపని సర్కారీ అధికారులు దౌరా (పర్యటనము) జేయునప్పుడు మాత్రమే వారికొరకు తీసుకొనవలయును. (౩) ఇట్లు నిర్బంధముగా పనిచేయవలసిన వారు బలోతా ఇనాము అనుభవించువారును, కూలినాలి పనియే వృత్తిగానుండి యదార్థముగా అట్టిపనియే చేసికొను చున్నవారును మాత్రమే. (౪) "వెట్టిపని" బరువులు ఒక గ్రామమునుండి ఇంకొక గ్రామమునకు తీసికొని పోవుటకొరకు మాత్రమే చేయవలెను; వేరుపనులకు ఎవరిని నిర్బంధించ వీలు లేదు. (౫) మగవారితో ౧౨ సేర్లకంటెను, ఆడువారితో ౮ సేర్లకంటెను, బాలురతో ౬ సేర్లకంటెను ఎక్కువ బరువు మోయించగూడదు. పదేండ్లకంటె తక్కువ వయస్సు గల వారితో పని తీసికొననేగూడదు. ఆడుమనిషిని అసలే వెట్టి పనికై బలవంతపెట్టగూడదు. (౬) ప్రతిఫలము నియమముల ప్రకారము ముందుగానే చెల్లించవలెను. అట్లు చెల్లించనిచో పని చేయవలసిన అవసరము లేదు. ఇది కొద్దిలో నియమావళియొక్క

సారాంశము. ఇట్టి స్పష్టములగు హుకుము లున్నను గ్రామస్థులగు పారిశ్రామికులను, పనివాండ్రను నానాబాధలు పెట్టి పని చేయించుకొనుట ఇప్పటికిని జరుగుచునేయున్నది. ఈ నియమావళి ప్రకటింపబడిన తరువాతగూడ అమలు జరుపుటలో అధికారులు తర్కవితర్కములు మొదలుపెట్టిరి. కాని పై అధికారులు అట్టి సందేహములకు తావులేకుండ, ఈ యంశమును స్పష్టపరచిరి. ♦ పైననుల్లేఖింపబడిన నియమావళియొక్కయు,

♦ మన ప్రభువుగారి స్వంత పాలనలోనిదగు "సర్ఫెఖాసు" మోతమదుయొక్క కార్యాలయపు గష్తీనిషాన్ ౩౮ తేది ౩౦-౧౨-౪౬ ఫసలీలోని వాక్యములు గమనించదగినవి:

'గ్రామములోని పటేలు, పట్వారీలు, దొరా అధికారులు వచ్చినప్పుడు వారియొక్కయు, వారి నౌకరులయొక్కయు అంట్లు తోముచెదరనియు, వంట చేయించెదరనియు, కోళ్ళను కోయింతురనియ గ్రామస్థులగు చాకలివాండ్లు మొరపెట్టుకొనిరి. స్థానికులగు అధికారులు, బలోతా ఇనాం అనుభవించువారు ఈ పనులను చేయక తప్పదు అనియు, ఇష్టము లేనిచో, ఇనాం భూములను వదలుకొనవలయు అనియు అభిప్రాయమిచ్చిరి. కనుక ప్రభుత్వమువారు ఈవిషయములో పొరపాట్లు తొలగించుటకై ఈవిధముగా స్పష్టీకరించిరి.

బలోతా ఇనాం ఎవరి కియ్యబడినదో అట్టివారు ప్రతిఫలము లేకుండ చాకిరి చేయుటకు బద్ధులు కారు అట్టి తీర్ల పనివాండ్రు గ్రామములో ఉండవలయు ననిమాత్రమే అట్టిఇనాములు ఇయ్యబడినవి. సర్కారువారి

గష్టీయొక్కయు ప్రతులు వేలకొలది అచ్చొత్తించి గ్రామ ములలోని బలోతాదారులకు పంచిపెట్టబడినవి. నియమావళిని వ్యాఖ్యసహితముగా "వెట్టిచాకిరి" అను పేరుతో తెలుగులో అచ్చొత్తించి వేలకొలది విక్రయించబడినవి. ♦ ఉద్యమ ప్రచారకులవలన ఈ వివరములు చక్కగా గ్రామములలో బోధించబడినవి; సభలలో ఉపన్యసింపబడినవి. మహాసభలలో తీర్మానములు చేయబడినవి. ఈ కర్తవ్యములు నాటినుండి నేటివరకు నిర్వహింపబడుచునేయున్నవి! అయినను ఫలితము శూన్యమేయని సిగ్గుతో ప్రకటించుకొనవలసి యున్నది!

పని బడినప్పుడు పిలిచితే ఆట్టివారు వచ్చుటకు మాత్రము ఆ యినాము ప్రతి ఫలముగా భావించబడవచ్చును వచ్చిన తరువాత పని ఏదైన చేసినయెడల దానికి వేరే ప్రతిఫలము ఇయ్యవలెను. కనుక, ముందు సర్కారి ఉద్యో గస్తులు దౌరాకు వచ్చిన పక్షమున వారి పని ప్రతిఫలము లేకుండ చేయించ వలదని పటేలు పట్వారీల కందరికి తెలియజేయవలెను."

♦ తక్కిన విషయములవలెగాక, "వెట్టిచాకిరి" విషయమున కేంద్ర సంఘము పక్షమున చేయబడిన ప్రచారము క్రైస్తవ సోదరులవలన ఎక్కు వగా ప్రశంసింపబడినది. నిజాం రాష్ట్రంలోని వెస్లియను మిషనువారును ఇతర మిషనరీ కార్యకర్తలును వందలకొలది "వెట్టిచాకిరి" లఘు పుస్తక ముల తెప్పించి యుపయోగించుకొని యుండుట మే మెరుగుదుము కొందరు మిషను కార్యకర్తలు కేంద్రసంఘ కార్యాలయమునకు వచ్చి తరచుగా గ్రామములలోని మాల మాదుగులు వెట్టిచాకిరివలన పడుచున్న కష్టములను

# తెలంగాణా ఆంధ్రోద్యమము.

## ౨

### పాఠశాలల స్థాపనము

ఆంధ్రజన కేంద్రసంఘమువారు తమకొర కేర్పరచుకొనిన కార్య ప్రణాళికలో "పాఠశాలల స్థాపనము" నకు ప్రత్యేక స్థాన మిచ్చియుండిరి. స్వయముగా కేంద్రసంఘము పక్షమున నిట్టిపని ఎక్కువగా జరుగుట సాధ్యముకాదని గ్రహించియుండిరి. కనుక గ్రామస్థులగువారి కీ కార్యమున సహాయము చేసి వారిచేత పాఠశాల లేర్పాటుచేయించుట సులభముగా నుండగలదని భావించి, నూటికి 3 గురుమాత్రము చదువు వచ్చినవారుగల ఈరాజ్యమున చాల సేవచేయవచ్చునని కార్యకర్తలు నమ్మి అట్టిప్రచారము మొదలుపెట్టిరి. కాని దురదృష్టమువలన, కేంద్ర సంఘమువారి ప్రచారము ప్రారంభమైన రెండు సంవత్సరముల

---

కేంద్రసంఘ కార్యదర్శితో ఆ కాలమున చాల విచారముతో జెప్పియుండి నట్లు మాకు తెలియవచ్చినది. అనేక సందర్భములందు కార్యదర్శి, వారి నిట్లు కోరియుండెను. "మీ తెల్లపాదిరీ మహాశయులు, మా రెవెన్యు (మాల్గుజారీ) మంత్రివర్యులగు తెల్లవారిని కలుసుకొని మాట్లాడినచో గ్రామస్థుల కష్టములు ఈ విషయమున ఎక్కువ సులభముగా తీరగలవు" కాని, అది సాధ్యము కాదనియే వారు ప్రత్యుత్తర మిచ్చుచుండిరి. తెల్లవారగు పాదిరీలు ఏల ఈ విషయమున శ్రద్ధగైకొన దలచరైరో గ్రహించజాలము! ఇట్టి నిర్బంధములు తొలగించబడినచో నిమ్నజాతివారికి క్రైస్తవ మతమున చేరుటకు ఆకర్షణ తప్పిపోవునని వారు భావించిరా!

(౧౩౩౪ ఫ) లోనే నిజాము ప్రభుత్వమువారు "ఖాన్గీపాఠశాలల నియమావళి" యను దానిని నిర్మించి, ఈ కార్యమునకు అంత రాయములను కల్పించిరి. దీని మూలమున, ఇంచుమించు నాల్గువేలఖాన్గీ(ప్రజలు పెట్టుకొనిన) పాఠశాలలు ఈ రాజ్య మున తగ్గిపోయినట్లు ప్రభుత్వమువారి నివేదికలే స్పష్టపరచినవి!

పైనచెప్పిన నియమావళి ప్రకారము, ౧౫ మందికిగాని అంతకంటె ఎక్కువమందికిగాని చదువుచెప్పు ఏ (ఖాన్గీ) పాఠ శాల యైనను, ఏ గ్రామములోనైననుసరే, ఎంతచిన్నదైనను సరే, ప్రభుత్వమువారి ఆజ్ఞను ముందుగా పొందనిది, స్థాపించ బడగూడదు. (ని. ౨). "నియమావళి" అమలులోనికి వచ్చు టకు పూర్వము ఎంత కాలముచుండియైననుసరే, పని చేయు చున్న పాఠశాలలకుగూడ ఈ నియమములోని నిర్బంధములు వర్తించును. (నియమ పీఠిక) ఈ నియమములను ఉల్లంఘించిన పక్షమున అట్టిపాఠశాల పోలీసువారిద్వారా బందు చేయించ బడును. ఇది నియమావళియొక్క సారాంశము. ఇట్టినియమా వళి వలన అసలే అజ్ఞానాంధకారమున మునిగియున్న ఈ రాష్ట్ర మున మరింత అంధకారము వ్యాపించగలదని ప్రజా సంఘములు ఎంతో ఆందోళన జరిపియుండెను. ♦ కాని ఆంధ్రోద్యమపు

---

♦ హైదరాబాదు నగరమున ౧౩౩౪ఫ. ౨౦ అజారునాడు సమా

ప్రథమదశాకాలమున(౧౩౩౯ ఫ. వరకు) ప్రభుత్వమువారి కీవిష యములో దయరాలేదు. ♦ ఆకాలమున కార్యకర్తల శక్తి

వేశమైన నాల్గువేల ప్రజాసమూహము నెదుట నిజాంరాష్ట్ర ప్రజాపక్ష విద్యా మహాసభయెదుట అధ్యక్షోపన్యాస మొసగుచు విఖ్యాత యశో భూషణుడగు పండిత హృదయనాథ కుంజ్రూగారు మేఘ గంభీర భీషణమగు భాషణమున నిట్లు సెలవిచ్చిరి:—"ఈ ప్రత్యేక విషయమున (ఖాన్గీపాఠ శాల నియమావళినిగురించి) నాకు హైదరాబాదు ప్రభుత్వమువారి పద్ధతి ఏమాత్రము బాగుండలేదు. ఈ నియమావళివలన పాఠశాలలు స్థాపించుట కష్టములు కలుగగలవు. భారతదేశములో నే నెరిగినంతవరకు ఇట్టి ఆజ్ఞలు గలఒక ప్రాంతమైనను, ఒక దేశీయ రాజ్యమైనను లేదు. ఇట్టిదానివలన విద్యాభివృద్ధి కలుగజాలదు...ప్రభుత్వమువారు నిర్బంధ విద్యా పద్ధతిని ఏర్పాటు చేసియుండినచో, ఇట్టిహుకుమును జారీచేయుట చెల్లదగి యుండె డిది. నిర్బంధ ప్రారంభ విద్యావిధానము లేనందులలోనున్న యూరపు రాష్ట్రములలో, ఒక జర్మనీలో మాత్రము ఇట్టి "నియమావళి" కలదు; మరెక్కడను లేదు. నేనుమాత్రము ఇట్టి వర్తనమునకు అనుకూలుడను కాజాలను. ఈ రాష్ట్రపు ప్రభుత్వమువారు ఇట్టి నియమములను రద్దుపరచి తమ విజ్ఞానమును రుజువు పరచుకొనెదరని ఆశించుచున్నాను. (కరతాళ ధ్వనులు) ప్రజాపక్ష విద్యా మహాసభ మొదటి(ఉర్దూ)నివేదిక. పుట ౨౧. ౨౨. నియమావళి యోగ్యత దెల్పుటకిది చాలునని భావించుచున్నాము!

♦ ఇంచుమించు ౨౦ ఏండ్లవరకు ఆచరణలో నున్నతరువాత ఇటీవల రెండుమూడేండ్ల క్రింద ప్రభుత్వమువారు దీనిలో కొలది మార్పులు చేసిరి అనగా ప్రారంభ, మాధ్యమిక (మిడిలు) పాఠశాలల స్థాపించుకొనవచ్చు ననిరి. హైస్కూళ్ళకు ఈ నిర్బంధములు ఇంకను కఠినముగా చేయబడినవి.

సామర్థ్యములు గ్రామములలోని చిన్నచిన్న పాఠశాలలు, సాధ్యమైనంతవరకు పడిపోకుండ కాపాడుటలో ఉపయోగించ వలసివచ్చినది. సర్కారి పాఠశాలల ప్రధానోపాధ్యాయులో, పోలీసు ఉద్యోగులో, స్థానిక ఖాస్గీ పాఠశాలను ఎత్తివేయమని ఆజ్ఞాపించుచుండుటయు, పాఠశాలను నడుపుచున్న పేద పంతులు మొత్తుకొనుచుండుటయు, కార్యకర్తలు నియమముల ప్రకారము అంగీకారము సంపాదించుటలో పంతుళ్ళకు తోడ్పడుటయు జరుగుచుండెను. ఉద్యోగుల పత్రవ్యవహారము, వర్తనము, తరచు పరిహాసాస్పదముగ నుండెను. నగరముల లోను—తుదకు రాజధానీ నగరము చుట్టునట్టులను— ఈ నియమావళికి అమలు జరిగినది. పంతుళ్ళ పరిస్థితులు దయ నీయములుగా నుండెను. ఆకాలమందు రాజధానీ నగరము నకు కొత్వాలు పదవియందుండిన రాజా బహాదరు వేంకట రామారెడ్డి ఓ. బి. గారి న్యాయ పక్షపాతమువలన కొందరి కష్టములు గట్టెక్కినట్లు మాకు జ్ఞాపకము కలదు.



# తెలంగాణా ఆంధ్రోద్యమము

## ౬

## ప్ర చా ర కా ర్య ము

### లఘు పుస్తకములు; ప్రచారకులు

ఆంధ్రోద్యమ ప్రచారమునకుగాను అప్పుడు లభించిన సాధనములు నాల్గు:- (౧) లఘుపుస్తకములను ప్రకటించుట (౨) ప్రచారకులు జనులతో ముచ్చటించుట (౩) బహిరంగ సభలలో ఉపన్యాసముల జరుపుట (౪) వార్తాపత్రికలు: పై వానిలో, మూడవ సాధనమును ఉపయోగించుకొనుటలో ఎన్నియో కష్టములు కలిగినవి. ప్రభుత్వమువారి నియమములు ఎంతో అడ్డము వచ్చినవి. వానికథకొంత దీర్ఘము కనుక, ఈ సందర్భమున మొదటి రెండు పద్ధతులలో జరిగిన పనిని వివరింతును : మూడవ, నాల్గవ పద్ధతినిగురించి ప్రత్యేకముగా ఒక ప్రకరణమును ఉపయోగించుకొనెదము.

### ల ఘు పు స్త క ము లు

తెలంగాణములో, చదువుకొనినవారికి ఉపయోగపడు ననియు, వారిద్వారా చదువుకొననివారి వరకుగూడ కొంత

విజ్ఞానము వ్యాపింపచేయుటకు వీలు కలుగుననియు తలచి, ఈ పద్ధతి మొదటినుండియు అవలంబించబడినది. ఈ దృష్టితో మొట్టమొదట వెలువరచబడిన లఘు పుస్తకము "నిజాం రాష్ట్రాంధ్రులు" అనునది. దీని ప్రతులు వేలకొలది విక్రయింపబడినవి. మూడుమారులు ఇది అచ్చయినది. ఆరంభమున మన రాష్ట్రములోని ఆంధ్రులకు తమ స్థితిగతులను దెలుపుటలో యీ చిన్న పుస్తకము చాల పనిచేసినది. దీనియందు జనులకు తమ స్థితి తెలుపబడినదే కాని వృద్ధిమార్గములు చూపబడలేదు. ♦ రెండవ పుస్తకము "నిజాంరాష్ట్రాంధ్రుల అభివృద్ధి మార్గములు" అనునది ప్రకటించబడెను. ఇదియు చాల ఉపయోగ పడినది. ఈ రెండుపుస్తకములును అందరికి అక్కరకు వచ్చు విషయములు కలవై యుండెను. మూడవది "వర్తక స్వాతంత్ర్యము" అనునది గ్రామవర్తకులకు ఎక్కువ యుప

---

♦ ఆంధ్రోద్యమ వ్యాప్తికొరకును, ఆంధ్రవిద్యా సంస్థలకొరకును, పేరు ప్రతిష్ఠలను ఏమాత్రము కోరక, తన నామమును బయట పడనీయక ప్రభుత్వమువారి యుద్యోగమున నుండియు అమితముగా సేవచేసిన శ్రీ ఖడ్లకొండ నరసింహారావుగారు రెండవ లఘు పుస్తకమును, ఆయిదవదానిని స్వయముగా వ్రాసియుండిరి. వీరి యాలోచన సహాకారములు, తక్కిన లఘుపుస్తకముల రచనా విషయమునను, ఆంధ్రోద్యమమునకు సంబంధించిన అనేక ఇతర కార్యములందును అమితముగా తోడ్పడినవి.

యోగపడినది. దీనిని శ్రీయుత మందుముల రామచంద్రరావు, హైకోర్టు వకీలుగారు, చాల శ్రమచేసి వ్రాసిరి. ఇది నాల్గు కూర్పులను జూచినది. దీని మొదటికూర్పు తిప్పర్తిగ్రామ వర్తకుడగు శ్రీపబ్బతి యల్లయ్యగారివ్యయములతో ముద్రితమై యుండెను. నాల్గవపుస్తకము "మొహతర్ఫా—మగ్గము పన్ను" అనునది. ఈ లఘుపుస్తకము ఉరుసు గ్రామవు పద్మశాలీయ నాయకుడగు శ్రీమామిడేటి పాపయ్యగారు, ఆ జాగీరుగ్రామవు పద్మశాలీయులకు జాగీరుదారులవలన కలిగిన ముఖ్య ఇబ్బంది యగు "మొహతరఫా" పన్నును ప్రతిఘటించుచు ప్రభుత్వ కార్యాలయములందు చేయుచున్న ప్రయత్నముల సందర్భమున, వారి వ్యయములతోనే ప్రకటించబడినది. ఇతర అనేక జాగీరులలోకూడ పద్మశాలీలనుండి "మగ్గముపన్ను" పేర ఒక పన్ను వసూలుచేయబడుచుండినది. ప్రభుత్వమువారు ఇట్టిపన్ను క్రమమైనదికాదని విధించినను, హైకోర్టువారు ఉరుసుగ్రామవు జాగీరుదారుల యభియోగమునందే ఈ పన్ను అక్రమ మైనదని తీర్మానించినను, ఈపన్ను మరల మరల వసూలు చేయుటకై ప్రయత్నములు జాగీరుదారులవలన సాగించబడుచునేయుండెను. కనుక వర్తకులకు "వర్తక స్వాతంత్ర్యము" అనుపుస్తకము ఎట్లు ముఖ్యమై, లాభదాయకమైనదో, జాగీరు గ్రామములలో నివసించు పద్మశాలీయులకు ఈ లఘుపుస్తకము అట్లే ఉపయోగ

కారియైనది.

ఐదవ పుస్తకము "వెట్టిచాకిరి" యనునది. దీనిలోని విశేషములు గత ప్రకరణములో చక్కగా కానవచ్చెను. దీని వలన కలిగిన ఉపయోగము, తెలంగాణములోని కార్యకర్తలకు దీని వలన కలిగిన విజ్ఞానము, క్రైస్తవ మిషనరీ సోదరులవలన ఈ పుస్తకమునకు వారి వారిలో కలిగిన వ్యాప్తి ఇంతింతయని నిర్ణయించజాలము. ఈ లఘుపుస్తకముతో పాటు, దీనిలో ఉల్లేఖించబడిన ప్రభుత్వమువారి "నియమావళి", సర్ఫెఖాసు మోతమదుగారి కార్యాలయపు గష్తీ, ఈ రెంటిను యథా తథములుగా, ముద్రించి వేలకొలది ఉచితముగా కూలినాలి వారలకు గ్రామములలో పంచిపెట్టబడినవి.

కేంద్రసంఘ ప్రచురణములలో చేర్చబడక పోయినను, ఆంధ్రోద్యమ వ్యాప్తికై వ్రాయబడి అమూల్యమైనదగు ఒక లఘుపుస్తకము ‡ "నిజాంరాష్ట్రపు జనపరిగణనము" అనునది. ఇది నిజాంరాష్ట్రముయొక్క ౧౯౨౧ సం॥ జనపరిగణనము (మర్దుంషుమారి) పూర్తియైన తరువాత ప్రభుత్వమువారు ప్రకటించిన అంకెలనుబట్టి సిద్ధము చేయబడి యుండెను. (౧౯౨౪). దీనిలో జనపరిగణన సంబంధమైన వివరములన్నియు జాగరూక

‡ ఇచ్చట అయిదు లఘుపుస్తకములు, నిజాంరాష్ట్రపు జనపరిగణనము (౧౯౨౧), అను వారియొక్క పుస్తకము, మొత్తము, ఆరుపుస్తకములు

తతో, ఆంధ్రోద్యమ కార్యకర్తలకు అమితముగా నుపయోగ పడునట్లు వ్రాయబడి యుండెను.

---

మాత్రమే పేర్కొనబడినవి. ఆంధ్రోద్యమ సంబంధమున ప్రకటింపబడిన ప్రచురణము లింతమాత్రమే యని భావించగూడదు. ఆంధ్రోద్యమము యొక్క మొదటిదశయనబడు మొదటి ఎనిమిది సంవత్సరముల కాలములో ప్రకటింపబడిన పుస్తకములు మాత్రమే యిచ్చట చెప్పబడినవి. తరువాతి కాలమున—సిరిసిల్లలో జరిగిన చతుర్థాంధ్రమహాసభ (౧౩౪౫ఫ) పూర్తియై పోయి కేంద్రసంఘ మనునది అస్తమించు వరకు—ఈలఘుపుస్తకములు వెడలు చునే యుండినవి. ఆంధ్రోద్యమముయొక్క రెండవదశలో (౧౩౩౯ ఫ నుండి ౧౩౪౫ ఫ. వరకు) వెలువడిన లఘుపుస్తకములసంఖ్య ౧౯. వీనిలో జోగిపేట, దేవరకొండ, ఖమ్మము, సిరిసిల్ల అనుచోట్లసమావేశమైన నాల్గు మహాసభా నివేదికలు పోగా, ౧౫ లఘుపుస్తకములు వెలువడినట్లు కాన వచ్చుచున్నది వానిలో ముఖ్యమైనవి: (౧) వ్యవసాయకులకు కొన్ని సూచ నలు (౨) న్యాయస్థానములు; దేశభాషలు (౩) మద్యపానము (౪) గ్రంథాల యములు (౫) మనవాక్స్వాతంత్ర్యము (౬) గష్తినిషాన్ ౫౩ యొక్క వివరణము (౭) రైతుల ఋణబాధా నివారణము (౮) మన విద్యాసమస్యలు (౯) నిజాంరాష్ట్రపు జనపరిగణనము (౧౯౩౧). ఈ తుదిపుస్తకము ౧౯౨౧ సం॥ నిజాంరాష్ట్రపు "జనపరిగణనము" అనుదానివలెనే, చాల పరిశ్రమతో వ్రాయబడినది. ఈతొమ్మిదంటిలో మొదటిది నిజాము ప్రభుత్వమువారి వ్యవసాయ శాఖాధికారియగు శ్రీ సర్వోత్తమరావు బి. ఏ. జి. గారి ఉద్గ్రంథ వ్యాసమునకు ఆంధ్ర.అనువాదము: రెండవది ఆంధ్రోద్యముయొక్క ప్రథమ దశలోను తరువాతను చాల పనిచేసిన ఉత్సాహవంతులగు కార్యకర్తలు శ్రీ ఎం. నారాయణరావు హైకోర్టు వకీలు, మహబూబునగరము గారి

కేంద్రసంఘముయొక్క ప్రచురణములలో చేరనిదియు, కార్యకర్తలకు ఆ కాలమున ఎక్కువ సహాయమును ప్రోత్సాహము నొసగినదియు నగు మరియొక చిన్న పుస్తకము, "నిజాం రాష్ట్ర ప్రశంస" యనునది. ఇది పద్యాత్మకము. దీనిలో నిజాం రాష్ట్రములోని తెలంగాణ దేశముయొక్క చారిత్రక వైభవము వర్ణింపబడినది. ఇది ఆంధ్రోద్యమ కార్యకర్తలందు, దేశసేవా సక్తిని కలిగించుటలో చాల తోడ్పడినదనిమాకు జ్ఞప్తి యున్నది. ఇందలి పద్యములు, †తద్గ్రంథకర్తలకవితకు సహజమైనవిధమున రసపరిప్లుతములై ఎంతో మనోజ్ఞములును, హృదయాకర్షకములునై యుండెను. ఇట్టి యుత్తేజనము నిజాంరాష్ట్ర ఆంధ్రోద్యమమునకు కలిగించిన కర్తలు వంద్యులని వేరే చెప్పవలసిన పనిలేదు.

---

*ఉర్దూ వ్యాసమునకు అనువాదము. మూడవదాని కర్త ఎవరో, మాస్మరణ తోడ్పడుట లేనందుకు చింతిల్లుచున్నాము. నాల్గవది విఖ్యాత యశులును, ప్రథమాంధ్ర మహాసభాధ్యక్షులును, బహుళ గ్రంథ విధాతలును నగు శ్రీ సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ. బి ఎల్ గారిది. ఎనిమిదవగ్రంథము, అవిషయమునుగూర్చిన ౧౯౨౧ సం॥ పు గ్రంథమును రచించిన ఆంధ్రోద్యమాభిమానియు, ఆంధ్ర భాషాభిమానియు, కర్తవ్యదీక్షాపరుడునగు శ్రీ కొమ్మరవు సుబ్బారావుగారు రచించినది వీరు ప్రభుత్వోద్యోగులుగా నుండియు ఆంధ్రవిద్యాసంస్థలకును, ఆంధ్రోద్యమమునకును చేసిన సేవ అపారము!

† ఈ పుస్తకమును రచించినవారు శతావధానులు, దూపాటి శేషాచార్యులు, వేంకట రమణాచార్యులు అను కవిసోదరులు: వీరిలో మొదటి

ప్రపంచములోని ఏ యుద్యమమునకైనను ప్రచారకుల సేవ అత్యంతావశ్యకమని చెప్పవలసిన పనిలేదు. ఇప్పటి కాలమున ప్రచారము చేయువారు గౌరవ కార్యకర్తలుగా నైనను నుండవచ్చును. లేదా, వేతనమును పొందుచు పనిచేయువారైనను కావచ్చును. మన ఆంధ్రోద్యమము అల్పారంభముతో జరిగినది దరిద్ర్యలోపము ప్రథమదశయందు ఎక్కువగా బాధించినది. కనుక ఆరంభదశయందు ఉద్యమ ప్రచారము సల్పిన వారందరును గౌరవ కార్యకర్తలే యని చెప్పవలసి యున్నది. ఎనిమిది వత్సరముల కాలపరిమితి (౧౩౩౧ ఫ నుండి ౧౩౩౯ ఫ. వరకు) గల మొదటిదశలో వేతనముపైన పని చేసిన వారు శ్రీ ఉన్నవ వేంకటరామయ్యగారు ఒక్కరే. వారు ప్రథమదశ యొక్క తుదిభాగమున, అనగా ౨౯ ఆజూరు ౧౩౩౮ ఫ. (౧-౧౧-౧౯౨౮) నుండి ప్రచార కార్యమునకై నియోగింపబడిరి.

---

వారు బ్రిటిషు ఆంధ్రదేశమున ఉపాధ్యాయోద్యోగనమునుండి, కొన్ని వత్సరముల క్రింద దివంగతులైనారు. రెండవవారు నిజాం ప్రభుత్వమువారి విద్యాశాఖయందు ఉపాధ్యాయులుగా పనిచేసి, ఇటీవల విశ్రాంతిలో నున్నారు. వీరికి మొదటినుండియు నిజాం రాష్ట్రములోని యాంధ్రదేశముపైనను, ఇచ్చటియాంధ్రుల పురోభివృద్ధిని గురించియు, అత్యంతాభిమానము. ఆంధ్రోద్యమముయొక్క ప్రారంభదశాకాలమున వీరు ప్రభుత్వోద్యోగమున ప్రవేశించి యుండలేదు. గ్రంథరచనమునందేకాక, ఆంధ్ర శాసనముల పరిశు

మన ఆంధ్రోద్యమపు గౌరవ ప్రచారకులను—ఉద్యమపు మొదటిదశయందు సేవయొనర్చినవారిని—పేర్కొన వలయునన్నచో, అది ఈ గ్రంథకర్తకు, అనేక కారణముల వలన చాల కష్టమైనపని. ఇట్టి యుద్యమమున కృషిసల్పిన వారందరును ప్రచారకులనియే భావించుటన్యాయమనిపించును. చేసిన కృషియొక్క వైశాల్యమునకు హెచ్చుతగ్గు లుండక తప్పవు. నగరములో సభలందుపన్యసించిన వారిని, అధ్యక్షు లుగా నుండినవారిని ఆంధ్రజన సంఘముయొక్క కార్య కర్తలను, కేంద్రసంఘ సభ్యులను—వారు ప్రచారకార్యమును చాలవరకు చేసినవారైనను—ఈ సందర్భమున ప్రచారకు లనుగా వర్ణించుట మాకు సమంజసముగా కనిపించుట లేదు. వారిపట్టికయు దీర్ఘమగును. కొందరిని వదలి, మిగిలినవారిని పేర్కొనుట మనస్తాపములకు కారణము కావచ్చును. కనుక మేమీ విషయమున చాల కృపణత్వముతో పనిగొనుచున్నందు నకు క్షమార్హులము.

లను, లిఖితములగు తాళపత్ర గ్రంథములను సంపాదించుటలోను, వానిపరి శోధనమునందును వీరు అపారమగు శ్రద్ధను, ఉత్సాహమును, ప్రావీణ్యమును ప్రకటించిరి. శ్రీ లక్ష్మణరాయ పరిశోధక మండలి కొరకు వీ రొనర్చినసేవ అత్యంత ప్రశంసార్హము!

అయినను, ఆంధ్రోద్యమపు మొదటిదశలో, గౌరవ ప్రచారకులుగా పనిచేసిన కొందరిసేవను ప్రత్యేకముగా ప్రశంసించుట మేము మాకర్తవ్యముగా భావించుచున్నాము.

ఉద్యమప్రచార మనుకార్యమును మన రాజ్యములో మొట్టమొదట చేసిచూపినవారు శ్రీపువ్వాడ వేంకటప్పయ్యగారు. వీరు సూర్యాపేటలో ప్రభుత్వ పాఠశాలయందు ఉపాధ్యాయులుగా పనిచేయుచు, ఉద్యమప్రచార కార్యమును తెలంగాణపు వివిధప్రాంతములలోను కడు శ్రద్ధతో సల్పిరి. పేదవారలగుటవలన ప్రయాణవ్యయములను మాత్రము కొన్నిసారులు వీరు తీసుకొనిరి. వీరిసేవ అమూల్యమును, నిస్వార్థమును, కార్యకర్తలకు మార్గదర్శకమును అయియున్నది. వీరు మన ఉద్యమముయొక్క ప్రథమదశాకాలముననే దివంగతులైరి.

చెప్పదగిన మరియొక గౌరవప్రచారకులు శ్రీ టి. కె. బాగయ్యగారు. వీరు నిజామాబాదు జిల్లాలో మన ప్రభుత్వము వారి తామీరాత్ శాఖలో తాలూకా అధికారులుగా నుండి ప్రారంభదశలో ఆంధ్రోద్యమ ప్రచారముసల్పిరి. నిజామాబాదు ప్రాంతములో, ఆకాలమున ఆ మాత్రపు ప్రచారము చేసిన ప్రభుత్వాధికారులు మరియొకరు ఉండలేరు. వీరిసేవ ప్రశంసార్హమని చెప్పవలయును.

వరుసలో మూడవ వారైననూ, అనేక కారణములవలన గౌరవ ప్రచార మొనర్చిన వారిలో ప్రథమస్థానము నాక్రమించ నర్హులగువారు శ్రీమతి చాట్రాతి లక్ష్మీనరసమ్మగారు. ఈ యమ ఖమ్మములోను, ఎర్రుపాలెములోను, హసనపర్తిలోను ప్రభుత్వమువారి ఆంధ్రబాలికా పాఠశాలలలో ప్రధానోపాధ్యాయినిగా నుండెను. సంస్కృతాంధ్రములందు మంచి పాండిత్యముతో పాటు, త్యాగభావము, నిష్కల్మషవర్తనము, దేశసేవాసక్తి, గద్యపద్యాత్మకములగు గ్రంథరచనా నైపుణ్యము జనులకు ఈమెయందు భక్తిభావము కలిగించుచుండెను. శ్రీమతి లక్ష్మీనరసమ్మగారు స్వంత వ్యయములతో, ఆంధ్రోద్యమ కార్యకర్తల కోరికపైన ప్రచార మొనర్చి స్త్రీలసభలందుపన్యసించుచుండిరి. వీరు తమవద్ది యనేక పుస్తకములను నారాయణగూడెములోని బాలికల ఉన్నతపాఠశాలకు ఆలమారసహితముగా నర్పించి ఆ సంస్థకు తోడ్పడిరి. బాల్యమునందే భర్తను గోల్పోయియుండిన ఈమె ఉత్తమవిధమున జీవనము గడిపి, అనేక బాలికలకు విద్యాదాన మొనర్చి, వార్ధకదశయందు, ఇటీవలనే హనుమకొండలో దివంగతురాలైనది!

ఆంధ్రోద్యమ ప్రచారకులుగా నిస్స్వార్థసేవ యొనర్చిన మరియొక సోదరుడు శ్రీ గంగుల శాయిరెడ్డిగారు.

నిజాంరాష్ట్రపు ఆంధ్రోద్యమమునకు గొప్ప గౌరవమును తెచ్చి, దానిని ఉన్నతస్థితికి తెచ్చిన ప్రచారకులలో అందరికంటె ఎక్కువగా ప్రశంసించదగినవారు శ్రీ ఉన్నవ వేంకట రామయ్యగారు. వీరిప్రచారపద్ధతి, పోయినచోటులందెల్ల అచ్చటివారి విశ్వాసమునుగడించిన వీరి వర్తనము, సంఘకార్యకర్తల హృదయములందు వీరు స్థాపించుకొనినస్థానము, ఇవి అసాధారణములని చెప్పవచ్చును. గ్రామములందు పర్యటనము చేయుపట్ల, వీరు జీవితముపైన పనిచేయు ఉద్యోగియని తలంచుటకు వీలులేకుండెను. వీరు ఉద్యమనాయకులుగాని సామాన్యులుకారను భావము ప్రజల మానసక్షేత్రములందు స్థాపితమగుచుండెను. వీరు ఇంచుమించు ఎనిమిది సంవత్సరముల కాలము ప్రచారము సల్పినతరువాత, మహాఘనతవహించిన నిజాము ప్రభుత్వమువారి పోలీసుశాఖయొక్క సూచన ననుసరించి, విధిలేక, వీరిని ఉద్యోగమునుండి తొలగించవలసివచ్చినది † తరు

† శ్రీ వేంకటరామయ్యగారు కరీంనగరముజిల్లాలోని హుజూరాబాదు తాలూకాకు చెందిన గట్ల నరసింగాపుర మను గ్రామమునందుండి ఆంధ్రోద్యమ ప్రచారము చేయుచుండగా, ఒకనాటి రాత్రి పోలీసు సర్కిలు ఇన్స్పెక్టరుగారును, సి ఐ.డి. ఇన్స్పెక్టరుగారును అచ్చటికి వెళ్ళి ౬ తీరు ౧౩౪౨ ఫ॥నాడు (౧౧-౫-౧౯౩౩) హోంసెక్రెటరీగారి కార్యాలయమునకు హాజరు కావలయునను నొక నోటీసును వారికి స్వయముగా రాత్రి ౧౧గం॥ వేళ అందచేసిరి. (౧౯-౭-౧౩౪౨ ఫ=౨౩-౪-౧౯౩౩) దాని

వాత కొన్ని వత్సరములవరకు వీరు గోలకొండపత్రికా కార్యా
లయమున వ్యవస్థాపకులుగా పనిచేసిరి. సుమారు ఏడేండ్లక్రింద
వీరు స్వస్థానమగు ఉన్నవ (గుంటూరుజిల్లా)కు వెళ్ళి అచ్చటనే
జీవిత శేషమును గడుపుచున్నారు.

---

పైన వారు వెంటనే హైదరాబాదువచ్చి కేంద్రసంఘ కార్యదర్శికి సంగ
తులు తెల్పి హోంసెక్రెటరీగారి దర్శనముచేయగా వారు వారిని జిల్లా
పోలీసు డైరెక్టరు (నాజము) గారి కార్యాలయమున కంపిరి. అచ్చటి అధి
కారులు వేంకటరామయ్యగారికి మ.ఘ.వ. నిజాంప్రభుత్వమువారి పోలీసు
శాఖా కార్యదర్శిగారివద్దినుండి వచ్చిన యొక ఆజ్ఞాపత్రమును చదివి విని
పించిరట! "మీరు రాజకీయముల ప్రచారము చేయుచున్న పక్షమున
మిమ్ము మన్ననూరు పంపెద"మని దానిలో యుండెనట! (ఈమన్ననూరు
నిజాంరాష్ట్రములో రాజకీయదోషుల విచారణ లేకుండ నిర్బంధములో
నుంచు స్థలము. ఇది మహబూబు నగరము జిల్లాలో, అమరాబాద
కొండల ప్రాంతమున కలదు). అప్పుడు చదువబడిన ప్రభుత్వాజ్ఞ నకలు
యిప్పించమని కోరగా, అధికారులు ఇయ్యమనిరట! నకలు వ్రాసికొనెద
ననగా వద్దనిరట. ఉద్యమక్షేమమునకై అప్పటిస్థితిగతులను దృష్టియం
దుంచి శ్రీ వేంకటరామయ్యగారిని ప్రచారకోద్యోగమునుండి విముక్తుల
జేయుట తప్పనిపని యయ్యెను. అట్లుచేయుచు, కేంద్రసంఘకార్యదర్శి,
"వేంకటరామయ్యగారిని ఉద్యోగమునుండిఆపివేసితిమి కాని వారియందు
మీకు కానవచ్చిన దోషమేదో తెలిపిన పక్షమున వారిస్థలమున నియోగింప
బడు క్రొత్తప్రచారకునకు చెప్పవలసిన సంగతులు చెప్పవలసియుండును.
వెనుక జరిగినలోపములు రాకుండ ఏర్పాటు చేయవలయును. కనుక వారి
దోషమేదో దయచేసి తెలుపవలయును"నని వ్రాసిరి. దానికి ప్రభుత్వము

# తెలంగాణా ఆంధ్రోద్యమము.

## ౧౦

### ప్రచారకార్యము

### ఉపన్యాసములు, వార్తాపత్రికలు.

"ఉపన్యాసముల మూలమున విజ్ఞానమును వ్యాపింప జేయుట" యనునది ఆంధ్రోద్యమవ్యాప్తికై యావశ్యకమైన సాధనోపాయముగ ఆంధ్రజన కేంద్రసంఘము వారు మొట్టమొదటిసమావేశముననే నిశ్చయించి తదనుసారము కార్యము జరుపదలచిరి. కాని ఈమార్గమున వారికి అనుగడుగునకు ఆటంకములు ఎదురైనవి. ఇవి కార్యకర్తలకు చాల బాధాకరములును, విసుకు కలిగించునవిగాను ఉండెను. ఈ యాటంకములు, మహా ఘనతవహించిన నిజాము ప్రభుత్వమువారు

---

వారు ఎంత కాలము గడచినను, ఎన్నిమారులు వ్రాసినను జవాబుచెప్పలేదు తుదకు ప్రభుత్వము వారే, "ఈవ్యవహారమునందు ఇకముందు (హోంసెక్రెటరి వారి లేఖ నిషాన్ ౭౧ తే. ౨౯-౧౨-౧౩౪౩ ఫ = ౩౦-౮-౧౯౩౪) వ్రాయవలసిన పనిలేదు" అని శాసించిరి. ఉన్నవ వేంకటరామయ్యగారి తప్పు నిదోస్పష్టముగా తెలుపు ధైర్యము మహాఘనత వహించిన ప్రభుత్వము వారికి ఏల లేకపోయెనో దురూహ్యము ! ఇట్టి యంశములు మన ఆంధ్రోద్యమ చరిత్రలో ఎన్నియో రాగలవు.

బహిరంగసభల విషయములో కల్పించిన నిర్బంధములవలనను, అట్టి నిర్బంధములకులోబడి సభలు సమావేశపరుచుటలో జరుప వలసిన చర్యలవలనను సంభవించుచుండెను. ఇట్టి వివరములను వ్రాయవలసివచ్చిన ఈసందర్భమున మాకు ఆ దినములలో అనుభవమునకువచ్చిన దుఃఖపరిస్థితులు మరల తలంపునకు వచ్చి బాధించుచున్నవి!

ఆంధ్రోద్యమము ప్రారంభమైనదినము (౮-౨-౧౩౩౧ఫ) నకు దాదాపు రెండునెలలకుముందు ఒకనాడు (3-౧౨-౧౩3౦)ఫ (౮-౯-౧౯౨౧) మహాఘనతవహించిన నిజాము ప్రభువు రాజకీయ సభలనుగాని, "రాజకీయ పరిణామముల గలిగించునను అనుమాన ముకల్పించునట్టి సభలనుగాని, ఎవరును ప్రభువుగారి స్వంత అంగీ కారము పొందనిది సమావేశపరచకూడ"దనియు, "అట్టి అంగీ కారమునకు పూర్వము ముందుగా సభాకార్యక్రమమును బాబె హుకూమతుసభ (మంత్రిమండలి) వారు తెప్పించుకొనవలసి యుండు"ననియు, "బాబెహుకూమతుఅట్టికార్యక్రమమును అం గీకరించిననేగాని సభాకార్యములు జరుపకూడ"దనియు, ఫర్మాను ద్వారాశాసించెను. ‡ కనుక, రాజకీయ విషయములను గురిం

‡ ఫర్మాను తేది ४ మొహరం ౧3४౦ హిజ్రి, (3-౧౨-3౦ఫ.) అసాధారణ జరీదా (గెజెటు) తేది ౯-౧౨-४౦ఫ ౧3-౯-౧౯౨౧. మహా ఘనత వహించినట్టియు, మహామేధావంతులైనట్టియు మనప్రభువు గారు ఇట్టిఫర్మానును ప్రసాదించుటకు దాదాపు ఏడునెలలముందు, "నవనగరు" అను పేరుగల యొక దేశీయ సంస్థానాధీశ్వరుడగు మహారాజు ఇట్టిదేయొక

చిన సభలజరుపుట ఎంతకష్టమో ఊహించుటసులభమేకదా. ఈ ఫర్మానా అసాధారణమగు జరీదా (గెజెటు) ద్వారా, సర్వజనులకు దెలియుటకై దేశమున అంతటను ప్రకటించబడెను. అట్టి ఆజ్ఞలను తమ యిష్టమువచ్చిన విధమున అమలులో పెట్టుటకు అధికారులకు అవకాశము దొరకెను.

ఫర్మానును జారిచేసి తనరాజ్యములో దుస్థితికి పాలయ్యెను. నవనగర సంస్థానపు ఫర్మానులో నిట్లున్నది:-

"All are hereby informed that no person, associaton, or gathering should address a public meeting in political matters, without the permission of the political Secretary which should be secured in advance. Further, no political meeting of any kind should be held. Those who would act otherwise would be legally proceeded against" (State Gazette Vol 54 page 291 dated 16-2-1921. H. O. O. No 34)

(దీనివలన అందరకు తెలియపరచునదేమనగా;— రాజకీయశాఖా కార్యదర్శి సెలవు ముందుగానే పొందనిది, ఏమనుష్యుడుగాని, సంఘముగాని, సమావేశముగాని, రాజకీయ విషయములలో బహిరంగముగా ఉపన్యసించకూడదు ఇంతేకాదు. ఏవిధమైన రాజకీయసభకూడ సమావేశపరుపకూడదు. దీనికి విరుద్ధముగా నడచుకొనువారిపైన న్యాయశాస్త్రము (లా) ప్రకారము చర్యగైకొనబడును. (స్టేటుగెజిటు. సంపుటము ౫౪ పుట ౨౯౧ తేది ౧౬-౨-౧౯౨౧ ఎచ్. ఓ. ఓ. సంఖ్య ౩౪)

మన ఫర్మానులోను, నవనగర సంస్థానపు ఆజ్ఞలోను కొంత భేదమున్నది. మన ఫర్మాను ప్రకారము రాజకీయసభలో ఉపన్యసించుటకు ప్రభువుగారి అంగీకారము కావలెను. నవనగర రాజ్యములో రాజకీయశాఖా

"నిజాం రాష్ట్రీయ ఆంధ్రోద్యమము ప్రథమదశలో రాజకీయాశయములు కలదికాదుకదా. రాజకీయేతరమగు కార్యక్రమము ననుసరించుచు సభలు సమావేశపరచుటలో ఆటంకములు ఏలకలిగిన"వని ఎవరైన ప్రశ్నించవచ్చును. దానికి జవాబులుగా దోచుసంగతులు రెండు కలవు. (౧) ఉద్దేశించబడిన సభ రాజకీయమా, రాజకీయేతరమా? యని నిర్ధారణ యగుటెట్లు? అట్టి నిర్ధారణ చేయువారు ఈ రాష్ట్రములోనిఅధికారులేకదా? (౨) ఫర్మాను రాజకీయ సభలకేకాక, రాజకీయపరిణామముల

---

కార్యదర్శి అంగీకారముచాలును మన ఫర్మాను ప్రకారము, సభాకార్యక్రమముకూడ బాబెహుకూమతు(మంత్రిమండలము) అంగీకారముపొందినదై యుండవలెను; నవనగర సంస్థానమున అట్టిఅవసరములేదు మన ఫర్మాను ప్రకారము రాజకీయసభలేకాక, రాజకీయపరిణామములు కలిగించునుఅను అనుమానముతోచు సభలుకూడ నిర్బంధములకు లోబడునవి; నవనగర సంస్థానమువారికి సూక్ష్మవిషయము తోచలేదు. ఈవిషయమున మన ప్రభుత్వమువారి దృష్టివైశాల్యము చాలగొప్పదిగా గానవచ్చుచున్నది నవనగరరాజ్యమువారి ఆజ్ఞలకంటెమనఫర్మానులోని నిర్బంధములు ఎక్కువ కఠినముగా నున్నవి. ఇట్టి నిర్బంధములు కల్పించుటలో, మొదటిగౌరవము పొందినవారు నవనగర సంస్థానమువారు; రెండవగౌరవము మన రాజ్యము వారికి లభించినది. కాలముబట్టి అగ్రగాములు నవనగర సంస్థానాధీశులు; కాఠిన్యమునుబట్టి అగ్రగాములు మనరాజ్యాధీశులు. మొత్తము మీద నవనగర ప్రభుత్వమువారే నయమనిపించుకొనినారు. 'అచ్చనబుచ్చన్నలలో, అచ్చన యేకొంత మేలు!' అన్నసామెతనవనగరమునకువర్తించుచున్నది

కలిగించునను అనుమానమునకు తావొసగు ఇతర ప్రతిసభకు కూడ వర్తించుచున్నది. కనుక ఆంధ్రోద్యమపుప్రతిసభను రాజకీయ పరిణామములు కలిగించుసభగా ప్రభుత్వాధికారులు ఏల అనుమానించకూడదు? మొత్తముమీాద, కారణము ఏమైననగుగాక, ప్రతిసభకు సాధ్యమైనన్ని ఆటంకములు కలిగించుట అధికారులకు, స్థానిక ఉద్యోగులకు అవసరమని తోచుచుండెనేమో. కనుకనే, సభలు సమావేశపరుచుట చాలకష్టకార్యమైనది!

## సూర్యాపేట సభలు I

ఆంధ్రోద్యమ సంబంధమున నగరములో జరిగినసభలకు ఆకాలమున మొదట మొదట చిక్కులుకలుగలేదు. జిల్లాలలో జరుపబడిన మొట్టమొదటి పెద్దసభ, సూర్యాపేటలోనిది. † ఈ సందర్భమున అచ్చట జరిగిన సమావేశములు మూడు. (౧)

† ఈ సభలు ఆదర్శప్రాయముగా జరిగినవి. సభలకుసుమారు ౫౦౦ మంది పురుషులు ౨౦౦ మంది స్త్రీలు వచ్చియుండిరి. వర్తకుల త్యాగబుద్ధి, పూవాడ వెంకటప్పయ్యగారి కార్యోత్సాహము, లాభిశెట్టి లింగన్నగుప్తగారి పట్టుదల ప్రశంసార్హములు. వర్తకసంఘమువారిచే సుందరముగను, విశాలముగను, టీను రేకులతోను, తెల్లని చాందినీ గుడ్డలతోను, గాజు దీపములతోను, చిత్రవర్ణ శోభితములగు కాగితపు పూవులతోను, వేయిమంది కూర్చుండుటకు యోగ్యమైన సభామండపము నిర్మింపబడియెను. స్త్రీలకు ప్రత్యేకస్థల మేర్పరుపబడెను. నల్లగొండ, మిర్యాలగూడెము, సూర్యాపేట,

వర్తకసంఘసభ (౨) స్థానిక భజనమందిర వార్షికోత్సవసభ (3) స్థానిక ఆంధ్రగ్రంథాలయముయొక్క తృతీయవార్షికోత్సవ సభ: ఇవి ౧౦, ౧౧ మొహరు ౧౩౩౨(౧౭,౧౮ ఆగస్టు ౧౯౨౩) తేదులలో అంతగొప్పతనము కానరాదు కాని తెలంగాణాజిల్లా లలో ప్రజలపక్షమున, ప్రజలకు తెలియు భాషలో ఈపాటి సభలు జరుగుటవలన ఆంధ్రులలో అపరిమితమగు ఉత్సాహము కలిగినది. దీనివలన నల్లగొండజిల్లా ప్రజలందు అద్భుతమగు ప్రబోధము ఏర్పడినదన చెప్పవచ్చును. ఇది ప్రభుత్వాధికారుల అనుమానములకును, కొందరి మానసములలో అసూ

---

హుజూరునగరము, వీనితాలూకాస్థలములనుండియే కాక, వేరువేరు గ్రామములనుండి ౧౫౦ మంది వర్తకులీ సభకు విచ్చేసియుండిరి. హైదరాబాదు నల్లగొండనుండి విద్యార్థులు సభ నలంకరించిరి. విచ్చేసిన మహాశయులకు వర్తక సంఘమువారు వేరువేరు బసలేర్పరచి ఉచితముగా భోజన సదుపాయములు చేసిరి. ఈమూడు సంఘములపక్షమున కొందరు స్వచ్ఛంద సేవకులేర్పడి తమవిధులను చక్కగా నిర్వహించిరి.

ప్రథమదినసభకు బి. కిషన్‌రావు, హైకోర్టు వకీలుగారధ్యక్షత వహించిరి. సరస్వతియను బాలిక దైవప్రార్థన చేసెను. (ఈ బాలిక ఇప్పుడు నగరమున ఉత్తమగృహిణియు, దేశకార్యములందుత్సాహముతో పాలుగొను ఆంధ్రకుటుంబినిగను, నిరంతర ఖద్దరు ధారిణిగను, పరోపకార పారీణగను ఆంధ్ర స్త్రీలలో పేరుపొందియున్నది). బి. ఏ, విద్యార్థులగు కోదాటి రామకృష్ణరావుగారు స్వాగత పద్యములు చదివిరి. (తరువాత



కీ. శే. పువ్వాడ
వేంకటప్పయ్యాగారు.



కీ. శే. దేశభక్త
వామన్నాయకగారు.



ఆంధ్ర గ్రంథాలయ ప్రథమ మహాసభ – మధిర

యకును కారణమైనదని ఊహించుటకు ప్రబలకారణములు కలవు. అయినను కొంతకాలమువరకు ప్రతిఘటనము ఎక్కువగా కనుపడలేదు.

సూర్యాపేట సభల తరువాత, గౌరవ ప్రచారకులును, కేంద్రసంఘ కార్యదర్శియు, విడివిడిగాను, కొన్ని వేళలకలసియును, తెలంగాణపు జిల్లాలలో పర్యటన సల్పి, అట్టిసందర్భములలో అచ్చటచ్చట సభలలోనుపన్యసించిరి. అనేకస్థలములందు క్రొత్తగా నేర్పడసాగిన గ్రంథాలయముల స్థాపనోత్సవములు,

---

బి.ఏ.ఎల్.ఎల్.బి.లై, మంచికవియై, దేశకార్యతత్పరుడై అకాలమరణమునకు లోబడి ఆంధ్రులకు నష్టముకలిగించిన వాడయ్యెను!) సూర్యాపేట మిడిలుస్కూలు ప్రధానోపాధ్యాయుడు మౌల్వీఇఫ్తిఖారలిఖాన్ సా॥గారు ఉర్దూభాషలో నుపన్యసించిరి. నగరమునుండి వచ్చిన కేంద్రసంఘ కార్యదర్శి...జనసామాన్యమునకు చక్కగ తెలియునట్లు ఒకగంటవరకు ఉపన్యసించెను. వార్తాపత్రికలగురించి పువ్వాడ వేంకటప్పయ్యగారు, స్త్రీవిద్యను గురించి శివానంద మొదల్యారుగారు, పెండ్యాల నాగభూషణశాస్త్రి వకీలుగారు, నారాయణస్వామి, ఓవర్సియరుగారు, ఉపన్యసించిరి. బోయనపల్లి వేంకటరామారావుగారు కృతజ్ఞతదెల్పిరి. రెండవ దినపుసభకు కేంద్రసంఘ కార్యదర్శి అధ్యక్షతవహించెను. అమరవాది వేంకటనరసయ్యగారు వార్షిక వృత్తాంతము జదివిరి. గవ్వా అమృతరెడ్డిగారు చక్కని ఉపన్యాస మొసగిరి. (వీరుఆకాలమున ప్రభుత్వపాఠశాలలో ఉపాధ్యాయులు.ఇప్పుడుప్రముఖులగు వకీలుగా సూర్యాపేటలోనే పనిచేయుచున్నారు.)

అంతవరకేయున్న వానివార్షికోత్సవములు వివిధప్రాంతములలో జరుగసాగెను. కేంద్రసంఘ సమావేశములు (రెండవది, మూడవ

శ్రీయుతులు క. నరసింహాచార్యులు, అనంతరామారావు. గు, రామచంద్రయ్య గార్లును, సూర్యాపేట ప్రధానోపాధ్యాయులుగారును ఉపన్యసించిరి. అధ్యక్షుడు 'ముఖ్యముగా మహమ్మదీయ సోదరులకు దుఃఖకరమగు మొహ్రము దినము లగుటచే వారి మనస్సులను నొప్పిగలిగించగూడదను తలంపుతో, వాయిద్యముల వలనగాక కేవలము కీర్తనలతో సభను ముగించుటకు కారణమైనది' అని వచించిరి. మౌల్వీ మహమ్మదు ఖాసింసాహెబుగారు యీ గొప్పత్యాగమునకు అధ్యక్షులకు, మహమ్మదీయ సోదరుల పక్షమున, కృతజ్ఞతావందనము లర్పించిరి.

మూడవ సమావేశమునకు నల్లగొండ మిడిలిస్కూలు ప్రధానోపాధ్యాయులగు శ్రీ చిల్లరశ్రీనివాసరావుగారు అధ్యక్షులైరి. శ్రీకోదాటి వేంకటేశ్వరరావుగారు వ్రాసిపంపిన పద్యములు చదువబడెను (వీరువిశ్వవిద్యాలయ పట్టభద్రులయి స్థానిక ప్రముఖులుగా సత్కీర్తిని బడయుచున్నారు.) శ్రీమతి సరస్వతీబాయి గద్యపద్యాత్మకమగు వ్యాసము చదువుటచే ఆమెకు గ్రంథాలయ పక్షమున శ్రీయుతులు యామా ఆరవయ్య, (వర్తకసంఘ స్థాపకులై కీర్తిగాంచిన వీరు తరువాత కొంతకాలమునకు దివంగతులైరి.) మహేంద్రకర్ పెద్దోజి, కన్నెకంటి వీరయాచార్యులుగార్లు బహుమతులొసగిరి. పదేండ్ల బాలవింతువు కనకాంబ పద్యములు చదివెను. భువనగిరిలక్ష్మయ్య (వర్తకసంఘము కార్యదర్శి) గారీమెకు బహుమానమిచ్చిరి. మౌల్వీ మహమ్మదు ఖాసిం సాహెబుగారు ఆంధ్రభాషలో నుపన్యసించిరి. వెనుకటి సమావేశములో ఉపన్యాసములు సల్పినవారును ఉపన్యాసము లొసగిరి.)

వది) నల్లగొండలోను, మధిరలోను జరిగినప్పుడు వానివెనువెంట సమావేశ పరుపబడుచుండిన ఉపన్యాస సభలకును ఎక్కువగా ఆటంకములు కలుగలేదు. ప్రత్యేకమగు ఆటంకములు కలుగక పోయినను ప్రభుత్వాధికారులకు, ఆంధ్రభాషాప్రసారము కొరకును, ఆంధ్రులకు వారి పూర్వగౌరవమును దెలిపి భవిష్యత్తును గురించి వారిలో గొప్పవాంఛలు కలిగించుటకొరకును, సాధారణ పద్ధతిలోనే యగుగాక, చేయబడుచున్న ప్రయత్నములు రుచించలేదని కానవచ్చినది. ఇట్టి మన స్తత్వ ప్రకటనము గౌరవ ప్రచారకులకు కీ. శే. పువ్వాడ వేంకటప్పయ్యగారు, కరీంనగ

---

కేంద్రసంఘ కార్యదర్శియు అందరికి దెలియునట్లు రెండుగంటలవరకుపన్యసించిరి. లాభిశెట్టి లింగన్న గుప్తగారు, వర్తకుల విద్యాహీనత తొలగించ వలసిన అవసరమును చూపి విద్యాధికుల సహాయమును ప్రార్థించిరి. కొమర గిరి సీతారామచంద్రరావుగారు వితంతుద్వాహములు ఆవసరమా కాదా నిర్ణయించవలెనని కేంద్రసంఘ కార్యదర్శిని కోరిరి. కార్యదర్శి, ఈశ్వర చంద్ర విద్యాసాగరులవారు డెబ్బదిఏండ్లక్రింద, తమతల్లి ప్రేరేపణ వలన శాస్త్రశోధనచేసి వితంతూద్వాహములు శాస్త్రసమ్మతములని నిర్ణయించిరనియు, శ్రీ వీరేశలింగముగారు దీనిని ఏబదివత్సరములకు పూర్వము ఆంధ్ర దేశమున ప్రవేశపెట్టి యుండిరనియు...సంఘము అనుకూలించినచో ఈ సంస్కరణమునకు ఎట్టి అభ్యంతరము లేదనియు వక్కాణించిరి. (నీలగిరి పత్రిక ౨౩-౧౧-౧౩౩౨ ఫ. పుట ౮,౯ నుండి పైపంక్తులన్నియు సంగ్రహింపబడినవి.)

రము జిల్లాలలోని సిరిసిళ్ళయను తాలూకా ప్రధానస్థలమునచేసిన యొక ఉపన్యాససందర్భమున బహిరంగముగా వ్యక్తమైనది. ఆ సభ సిరిసిళ్ళలో, గ్రంథాలయమొకటి స్థాపించుటకై సమావేశపరుపబడెను. ఆసభకు అచ్చటి తహస్సిలుదారుగారే అధ్యక్షులుగా నుండుటకై కోరబడిరి. అందునకు ఆమహాశయుడు అంగీకరించి పీఠ మలంకరించెను. ఉపన్యాసములో, వేంకటప్పయ్యగారు, ఆంధ్రభాషాభివృద్ధికిగల యవసరమును జూపుచు, ఆంధ్రగ్రంథాలయ స్థాపన మచ్చట యగుచుండుటను ప్రకటించెను.

---

ఆంధ్రోద్యమ ప్రారంభ కాలమున, తాలూకాస్థలమగు సూర్యాపేటలో జరిగిన మొట్టమొదటి సభయగుటచే దీని వివరములు పాఠకులకు అప్పటి స్థితిగతులు దెల్పుటకును, ఆంధ్రోద్యమ వ్యాప్తిలో సూర్యాపేట తీసికొనిన ప్రధానభాగమును జూపుటకును, ఈ సభల వివరములను ఇంత దీర్ఘముగా నిచ్చటజూప సాహసించితిమి. ప్రభుత్వఉద్యోగులు, బాలికలు, ముస్లిముసోదరులు, సభలలో ఉత్సాహముతో పాల్గొనుటయు, ముస్లిము సోదరుడు ఆంధ్రములో ఉపన్యసించుటయు, బాలికల ఉపన్యాసములు గొప్పగా ప్రోత్సహించబడుటయు, వర్తకులగువారు సభాసమావేశములందు త్యాగముతో ప్రధానపాత్రమును గైకొనుటయు, స్త్రీలు గొప్పసంఖ్యలో బహిరంగ సభల నలంకరించుటయు,తరువాత గొప్పవారుగాకీర్తివహించిన యువకులు కొందరు ఈసభలో పాల్గొనుటయు, సూర్యాపేట సభల ప్రత్యేక లక్షణముల విజ్ఞప్తియందుంచుకొనవలసి యున్నది. ఇట్టి యోగ్యతలే తరువాతి దశలో తెలంగాణమున విశాలరూపము దాల్చినవి!

అధ్యక్షులగు తహస్సిలుదారుగారు ఉపన్యాసకునిపై ఆగ్రహ పడి, తీవ్రవచనములలో నిట్లనెనట! "సర్కారువారి దఫ్తరములలో వ్యవహారమంతయు ఉర్దూలో నుండగా, చచ్చిపోయిన తెనుగును బయటకు లాగవలసిన పనిలేదు." † తెలంగాణములోని ఒక తాలూకాలో గల దాదాపు రెండువందల గ్రామములకు అధికారియై, తెలుగుప్రజలు చెల్లించుచున్న పన్నులతో పొట్ట నింపుకొనుచున్న ఒక అధికారి మెదడునుండి బయల్పడిన ఇట్టి భావములే, ఆనాటి అధికారు లందరి మానసములందును మెదలుచుండెనని ఊహించుట తప్పుకాదు!

ఎట్లెట్లో కాలము ముందునకు వెళ్లినది. ౧౩౩౨, ౧౩౩౩ ౧౩౩౪ ఫసలి(౧౯౨౩, ౧౯౨౪, ౧౯౨౫) గడచినవి. ౧౩౩౫ ఫ ప్రారంభమై కొన్ని నెలలు గడచెను.

## జ న గా మ స భ.

ఆ దినములలో ఒకనాడు (౧౬-౬-౧౩౩౬ ఫసలీ= ౨౧-౩-౧౯౩౭) జనగామ (నల్లగొండజిల్లా) లోని గ్రంథాలయము పక్షమున ఉపన్యసించుటకై కేంద్రసంఘ కార్యదర్శి ఆహ్వానింపబడెను. సాయంత్రము సభ జరుగుననే ఆశతో అందరు వచ్చియుండిరి. ఆసమయమున కార్యకర్తయగు డాక్టరు

† (నీలగిరి పత్రిక ౨౩-౪-౧౩౩౩ ఫ. ప్రధాన వ్యాసము)

నరసింహారావుగారిని స్థానిక పోలీసు అధికారి పిలిపించి ఉపన్యాసము చేయించవద్దని హెచ్చరించెను. అంతటసభ ఆగిపోయినది. ఈ విషయమున పై అధికారులకు వ్రాసికొనినను ఉపయోగపడలేదు. ఫర్మానను ననుసరించి స్థానికాధికారులిచ్చిన ఆజ్ఞలో మేము ఏమాత్రము జోక్యముకలిగించుకొనమని వారు వ్రాసిరి. ‡

## సూర్యాపేట సభలు II

కేంద్రసంఘముయొక్క నాల్గవ సమావేశము, అంతకు పూర్వమే ఆంధ్రోద్యమమునకు ప్రధానరంగముగా ప్రఖ్యాతి గాంచియుండిన సూర్యాపేటలో, జరుపవలయుననియు, ఆసందర్భమున స్థానిక గ్రంథాలయ వార్షికోత్సవము మొదలగు అనేకసభలు — విద్యావిషయికములును, సామాజికములును — సమావేశపరచ వలయుననియు స్థానిక ప్రముఖులు నిశ్చయించి ఆహ్వానసంఘము నేర్పరుచుకొనిరి. ఇంకేమికావలయును? జిల్లా పోలీసు అధికారులకు, కొంప మునిగినట్లు తోచెను! సభలు రాజకీయములకు సంబంధించినవి కావని స్పష్టముగా కానవచ్చుచుండినను సభల తేదులకు ♦ అయిదు దినములుముందు నల్లగొండ జిల్లాపోలీసు మొహతమిము "ఇట్టిసభ ఏదియు ప్రభుత్వమువారి అంగీకారము పొందనిది సమావేశము కాజాల"

‡ డిప్యూటి డైరెక్టరు జనరలు లేఖ (౧౯-౫-౧౯౨౪)

♦ ౧౪, ౧౫, ౧౯-౯-౧౩౩౯ ఫ. (౨౨, ౨౩, ౨౮-౬-౧౯౨౪)

దనియు, అట్టి అంగీకారము పొందకయే సభజరుపబడు పక్ష
మున సభ జరుగనీయ"మనియు ఖండితముగా ఒకనిషేధాజ్ఞను†
సూర్యాపేట పురప్రముఖులపేర పంపిరి! కేంద్రసంఘ కార్య
దర్శియు, మరియొక కార్యకర్తయు, స్వయముగావెళ్ళి మొహత
మిము మహాశయునకు ఎన్నియోసమాధానములు చెప్పిరిగాని
అవియన్నియు వ్యర్థములయ్యెను! ఈవ్యవహారమునువెట్లయినను
ఉన్నతన్యాయస్థానము(హైకోర్టు) వరకు లాగికొని వచ్చినచో,
ప్రభువుగారి ఫర్మానుకు జిల్లా పోలీసువారు చేసిన అన్యాయము
క్రమమూ అక్రమమూ యనుసంగతి నిర్ధారణ కాగల దనునాశ
తోచినది. కాని, ఏదైన న్యాయస్థానముతో ఈవిషయమున
పలుకులు పలికించినగాని. ఉన్నతన్యాయస్థానమువరకుదీనితీసి
కొని పోవుటకు ఖానూను ఒప్పుకొనదు. కనుక, సూర్యాపేట
సభల సమాలోచపరచుటకు సెలవిప్పించవలసినదని నల్లగొండ

† నల్లగొండ జిల్లా కొత్వాలి మొహత్తమిము కార్యాలయపు మురా
సిలా సంఖ్య ౧౫౬ తేది ౧౨ అనుర్దాదు ౧౩౩౬ ఫ ఈ మొహతమియ
గారు మదరాసు విశ్వవిద్యాలయపుపట్టభద్రులు: బి.ఏ బి.ఎల్.పరీక్షలలో
నెగ్గినవారు వీరిపేరు సూఫీసా॥ వీరు హైదరాబాదు నగరములోనున్న
ప్పుడు అచ్చటి "యంగ్ మెన్సు ఇంప్రూమెంటు సొసైటి" యొక్క కార్య
నిర్వాహక సభ్యులలో నొకరుగాను, కార్యదర్శిగానో సహాయ కార్యదర్శి
గానో కూడ పనిచేసియుండిన ప్రజాకార్యకర్తలు! ఇదిఆశ్చర్యకరముకదా!

జిల్లా న్యాయస్థానములో విజ్ఞప్తి ప్రముఖ కార్యకర్తలగు శ్రీ అమరవాది వేంకటనరసయ్యగారి వలన దాఖలు చేయబడెను. దానిపైన అనుకొనినట్లే "ఇట్టిసభకు ప్రభువుగారి ఫర్మాను (౧౧ మొహారం ౧౩౪౦ హిజ్రి) ప్రకారము బాబెహుకూమతు సెలవు కావలెనని జిల్లాన్యాయాధీశ మహాశయుడు తీర్పుచెప్పెను.† కార్యకర్తల కోరిక నెరవేరినది!

† ౧౪ అమర్దాదు ౧౩౩౫ ఫ. నాడు జిల్లా న్యాయాధిపతి తీర్పు జరిగినది. దీనిపైన హైకోర్టులో నిగరాని (Revision) దరఖాస్తు చేయబడినది. అప్పుడు న్యాయవాదిగా నుండిన మిస్టర్ మహమ్మదు అస్గరు (తరువాత న్యాయమూర్తి పదవినలంకరించిన నవాబ్ అస్గరుయార్జంగు బహాదుర్) బారిష్టరుగారును, విఖ్యాతమహారాష్ట్ర నాయకులగు శ్రీ కాశీనాథరావు వైద్యా ఎం.ఏ.ఎల్.ఎల్.బి.గారును, ఆహ్వానసంఘము పక్షమున వాదించిరి. హైకోర్టుతీర్పు ౧ అమర్దాదు ౧౩౩౬ ఫ, నాటిది దకన్ లా రిపోర్టు పం: ౧౬ పుట ౨౧౯ పైన ప్రకటించ బడినది: (శేషాద్రిరావు బనాం సర్కారె ఆలీ) శ్రీ అమరవాది వేంకటనరసయ్యగారి పక్షమున చేసిన నిగరాని సూర్యాపేట సభలకు సంబంధించినది. శేషాద్రిరావుగారి పక్షమున చేయబడిన నిగరాని నల్లగొండసభలకు చెందినది: ఈరెండు వ్యవహారములను, ఒకేసారి హైకోర్టుప్రధాన న్యాయాధీసుడగు నవాబ్ మిర్జా యార్జంగు బహాదరుగారును, న్యాయమూర్తి నవాబు సిరాజ్ యార్జంగ్ బహాదరుగారును, విని ఒకటేతీర్పు చెప్పియుండిరి.

ఉన్నత న్యాయస్థానమువారి తీర్పులోని ప్రధానాంశము లు ఈ క్రింద నిచ్చుచున్నాము:—

“(౧) రాజకీయసభ కానట్టిదియై, విద్యను వ్యాపింప జేయుట మాత్రమే ఉద్దేశముగా గల సభను ప్రజలు సమావేశపరచిన పక్షమున, అట్టి సభకు ప్రభువుగారి ఫర్మానులో నున్న నిర్బంధములు కలిగించవలయు ననుట మహా ఘనత వహించిన ప్రభువుగారి భావము అయి యుండజాలదు”.

(౨) ఏదేని యొకసభ రాజకీయమా కాదా యను విషయమును ఉపన్యాసము జరుగక ముందే తీర్మానించుట సర్వదా కష్టమైనపని. ఎవరైనను ప్రభువుగారి ఫర్మానునకు విరుద్ధముగా సభ జరిపినయెడల, అట్టివర్తనము శాసన విరుద్ధ మనిపించుకొనును. దీని తరువాత, అట్టి వ్యవహారము న్యాయాధిపతి(మెజిస్ట్రేటు)ఎదుటకు వచ్చిన పక్షమున, అతడు శాసనము ప్రకారము నేరము రుజువైనచో శిక్ష విధించగలడు. కాని ముందుగానే జోక్యము పుచ్చుకొను అధికారము అతనికి లేదు.

ఇట్టి తీర్పు ప్రజాపక్షమునకు అనుకూలముగానే కానవచ్చుచున్నను, పోలీసుఅధికారులు దీనిని తమకుఅనుకూలమగు

విధమున అన్వయము చేసుకొనిరి. * దానికి ఫలితముగా, ఆ తరువాత, జిల్లా, తాలూకాల ప్రధాన స్థలములలోనేమి, గ్రామములలోనేమి, జరిగిన ఇట్టి సభలన్నిటికి, బాబెహాకూమతు అనుమతి కావలసివచ్చెను! కనుక హైకోర్టు తీర్పువల్ల ఆశించిన లాభము కలుగలేదు!

సభల సమావేశ పరచుటలో ప్రారంభమైన ఈ కష్టములు సాగుచునే వచ్చెను. ఉన్నత న్యాయస్థానపు తీర్పు బయటపడిన తరువాత, ఒకసంగతి స్థిరపడెను. అదేమనగా:- ఆంధ్రోద్యమ సంబంధమైన ఏ సభయు—గ్రంథాలయ వార్షికోత్సవసభలు సహితము— బాబెహాకూమతు అంగీకారము పొందనిది జరుగుట వీలు లేదనునదియే. ఇక సూర్యాపేట సభల సంగతి ఆలోచింతము.

* The High Court has in its order specially refrained from comment on the executive powers and responsbility of the police...The Director is therefore unable to comply with your request (No 170—C 25—7—1927 from Deputy Director General of Police, H. E. H. The Nizam's Dominions, Hyderabad-Dn.)

(పోలీసువారి జవాబుదారీని గురించియు, వారి అధికారములను గురించియు హైకోర్టువారు ఎట్టి విమర్శనము గావించియుండలేదు. కనుక డైరక్టరు (నాజిం) మీ విజ్ఞప్తిని అంగీకరించజాలడు (లేఖసంఖ్య ౧౭౦ సి. తేది:౨౫-౭-౧౯౨౭ డిప్యూటీడైరెక్టరుజనరలు, పోలీసుశాఖ, హయిదరాబాదు.)

అమర్దాదు ౧౩౩౫ ఫ. (జూను ౧౯౨౬) లోఁజరిపివేయబడిన సభలను జరుపుటకై, ప్రభుత్వమువారిని ఆశ్రయించి, వారి యంగీకారము బాబెహుకూమతుద్వారా పొందుటకు చాల కాలముపట్టినది. దైవానుగ్రహమువలన, ౧౩౩౬ ఫ. మధ్యభాగము (మార్చి ౧౯౨౭ ప్రాంతమున), మహాఘనత వహించిన మన ప్రభుత్వమువారి పోలీసు, మాల్గుజారీశాఖలకు ఆంగ్లేయ మంత్రినియమింపబడెను.♦ జిల్లా పోలీసుశాఖాధ్యక్షుని (నాజిము) పదవిపైనగూడ ఒక ఆంగ్లేయాధికారి నియామకము జరిగినది. దీనివలన కొన్ని యనుకూలము లేర్పడినవని చెప్పక తప్పదు. ఎట్టయిననేమి! సూర్యాపేటసభలు. ౨౬, ౨౭, ౨౮ తీరు ౧౩౩౭ ఫ. (౨౮, ౨౯, ౩౦ మే ౧౯౨౮) తేదులలోసమావేశపరచుటకు ప్రభుత్వమువారి సెలవుదొరకినది.‡ ఈసభలను ఉత్సాహవంతు

---

♦ వీరిపేరు లెఫ్టెనెంటుకర్నలు ట్రెంచుగారు. కొంతకాలము తరువాత వీరి స్థానమున టి. జే. టాస్కరుగారు ఆక్రమించిరి. ఈ రెండవవారి కాలమున సాధారణముగా ప్రజాహితోద్యమములకును—ముఖ్యముగా ఆంధ్రసభలకును, ఆంధ్రోద్యమ వ్యాప్తికిని—న్యాయమైన సహాయము లభించినది. వీరికి ఆంధ్రోద్యమ కార్యకర్తలు కృతజ్ఞులై యుండదగును.

‡ ఈ సందర్భమున సూర్యాపేటలో సమావేశమైన సభలు:—

(౧) కేంద్రసంఘ చతుర్థసమావేశము, (అధ్యక్షు) శ్రీ కొండా వేంకటరంగారెడిగారు.

లగు సూర్యాపేట పౌరులు చాల వైభవముగా జరిపిరి. దీనివలన ఆంధ్రోద్యమమునకు మంచి ప్రచారము లభించెను. తక్కిన వివ

---

(౨) ద్వితీయ ఆంధ్ర గ్రంథాలయ మహాసభ (అధ్య) దేశభక్త వామననాయకుగారు.

(౩) స్థానికవర్తకసంఘ వార్షికోత్సవము (అధ్య) శ్రీ వై అంజయ్యగారు, బి. ఏ.

(౪) ,, గ్రంథాలయ వార్షికోత్సవము (అధ్య) శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు, బి. ఏ. బి. ఎల్.

(౫) ,, భజనసమాజ వార్షికోత్సవము (అధ్య) శ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు.

(౬) స్త్రీలసభ:అధ్యక్షురాలు, శ్రీమతి చాట్రాతిలక్ష్మీనరసమ్మగారు.

(౭) ఆంధ్రయువక మహాసభ: (అధ్య) శ్రీ లోకనంది శంకరనారాయణరావుగారు, ఎం. ఏ.

(౮) ఆంధ్రసంఘ సంస్కార మహాసభ: (అధ్య) శ్రీ గాడేపల్లి సూర్యప్రకాశరావుగారు, ఎం. ఏ. ఎల్. టి.

(౯) వైశ్యులసభ: (అధ్య) శ్రీ పులిగిళ్ళ అంజయ్యగుప్తగారు.

ఈ సభల సమావేశ పరచుటకై ఏర్పడిన ఆహ్వాన సంఘమునకు అధ్యక్షత వహించినవారు (కీ.శే.) కోదాటి రామకృష్ణారావుగారు,బి.ఏ. ఎల్.ఎల్.బి. ఆహ్వానసంఘమువక్షమున మహాఘనత వహించిననిజాము ప్రభుత్వమువారి సహకారసంఘమువారును పశుచికిత్స శాఖాధికారులును, వ్యవసాయ శాఖవారును ఆహ్వానించబడి యుండిరి. పశు చికిత్సశాఖ జిల్లా అధికారిగారు సభలో మంచి యుపన్యాసము ఇంగ్లీషుభాషలో వినిపించిరి.



సూర్యాపేట గ్రంథాలయ మహాసభ వాలంటీయరుదళం

రములు ఎన్నియో కలవు. కాని గ్రంథవిస్తరభీతిచే వదలుకొను
చున్నాము. ‡ ఈసభలు ఇంత యుత్సాహముగా జరుగుటకు
ఒక కారణము, ప్రభుత్వాధికారులు సెలవియ్యక తిప్పలబెట్టుట.

---

దానిలోని ఒక్కొక్క వాక్యమునకు వెనువెంటనే ఆహ్వానసంఘ కార్య
దర్శిగారు తెనుగులో అనువాదము చెప్పుచువచ్చిరి.

ఈ సభలో మొత్తము ౫౦ మందివరకు విద్యార్థులు ఉపన్యాసము
లిచ్చిరని చెప్పవచ్చును. సభలలో మూడుదినములు హెచ్చుతగ్గులు లేకుండ
౧౦౦౦ మందివరకు పాల్గొనిరి.

సభలను గురించిన వివరములు గోలకొండ పత్రికయొక్క 3 సంపు
టములోని సంచికలు ౭, ౮, ౯ నుండి గ్రహింపబడినవి.

* "ఈ సభల సందర్భమున, సూర్యాపేట కొకదినముముందే జిల్లా
పోలీసుశాఖకు ఉపాధ్యక్షులగు శ్రీ మనోహర్ లాల్ పూరీగారు, సాయుధు
లగు సిపాయీలను ౨౦ మందిని నగరమునుండి వెంటబెట్టుకొని వచ్చియుం
డిరి. అయినను సభలోమాత్రము డ్రెస్సుతోనున్న పోలీసులెవ్వరు కనుపించ
లేదు." (గోలకొండ పత్రిక ౨౮ తీసు ౧౩౩౭ ఫ)

పైనచెప్పిన అసాధారణములగు కట్టుదిట్టములతో గొప్ప పోలీసు
అధికారులు నగరమునుండి పంపబడుటకు కారణము, క్రింది స్థానికాధికా
రులు పంపిన రిపోర్టులేయని చెప్పవలయును. జిల్లాపోలీసు రిపోర్టులోని
కొన్ని వాక్యములు:- "గడచిన కొన్ని సంవత్సరములనుండి సూర్యాపేట
రాజకీయములకు గొప్ప కేంద్రమై పోయినది...ప్రస్తుతస్థితులనుబట్టి బాబె
హుకూమతు సెలవుకూడ ఇట్టిసభలు జరుపుటకై ఇయ్యగూడదు."(నిపాక

యు, భయపరచుటయు, రెండేండ్లవరకు ఆలస్యముచేయుటయు నని చెప్పవచ్చును. రెండేండ్లక్రిందనే, తేదులు నిర్ణయించబడి యుండిన సమయమునే, సభలను సాగనిచ్చి యుండినచో, ఇన్ని సమావేశములు జరిగియుండవు! ఇంతటి యుత్సాహము ప్రబలియుండదు! ప్రజాపక్షము ఇట్టి ఫలితమును తమ కార్య శూరతకు నిదర్శనమని భావించును! అది సహజమే కదా.

## మిర్యాలగూడెము సభలు

ఆతరువాత సుమారు నెలదినములకు (౨౩ ౨౪. ౨౫ అమర్దాదు ౧౩౩౭ఫ.=౨౮,౨౯,౩౦ జూను౧౯౨౮) నల్లగొండ జిల్లా, మిర్యాలగూడెములో, మూడుదినములవరకు వరుసగా, గ్రంథాలయవార్షికోత్సవము, వర్తకసంఘస్థాపనము, యువజన సంఘస్థాపనము జరిగినది. మూడుదినముల సభలు ఉత్సాహ

---

౧౪౨ తేది ౭-౬-౧౩౩౫ ఫ. సూర్యాపేట, ఈ జిల్లాలోనే కాదు నిజాం రాష్ట్ర మంతటిలోను రాజకీయోద్యమములను బట్టిచూచినచో,ఒక అపాయ కరమగు స్థలము. ౧౩౩౫ ఫసలీలో ఇచ్చటి పరిస్థితులు చాల మనోవేధక ములుగా నుండెను. తమరు ముందుగానే అసాధారణముగా శ్రద్ధవహించి యుండనిపక్షమున...దీనివల్ల (ఈ యశ్రద్ధవలన) ఎట్టి పరిణామములు కలు గుచుండెడివో కదా; "(సర్కిలు ఇన్స్పెక్టరు రిపోర్టు,మొహతమీము గారి పేర నిషాన అలిఫ్ ౧౦-౯-౧౩౩౫ ఫ )

ప్రదములుగానుండెను. నగరమునుండి ప్రముఖులరాక, సూర్యాపేట, నల్లగొండ మున్నగు పెద్దస్థలములే కాక చుట్టుపట్టులనున్న చాల గ్రామములనుండియు వర్తకులును, రైతులును, ఇతర యువకులును వెళ్ళి సభలో పాల్గొనుట, వచ్చినవారందరికి ఆహ్వాన సంఘమువారు భోజనాది సౌకర్యములు కలిగించుట, సూర్యాపేటలో వేసినదానితో దాదాపు సమానమగు మంటపమును ప్రత్యేకముగా నిర్మించుట మున్నగు విషయములు ప్రశంశింప బడినవి. ‡ దీనివలన నల్లగొండ జిల్లాలో ఆంధ్రోద్యమమునకు మరింత బలము చేకూరినది.

‡ హైదరాబాదనుండి పోలీసుశాఖవారు ప్రత్యేక రిపోర్టులను పంపియున్నారని తెలిసినది. ముగ్గురు పోలీసు సబు ఇనస్పెక్టరులును, నల్లగొండజిల్లా మొహతమీముగారి మదద్గారును ప్రత్యేకముగా దయ చేసియుండిరి. సభ నలంకరించిన వారిలో, స్థానిక మున్సిపు మహాశయులును, ఇతర ఉద్యోగులను...ఉండిరి. (వీరందరు) జనులకెట్టి తొందరను కలిగించక సామాన్య ప్రేక్షకులవలె సభామంటపమున గూర్చుండి యువన్యాసముల వినిరి. ఇచ్చటజరిగిన మూడుసభలలో (౧) స్థానిక గ్రంథాలయ వార్షికోత్సవ సభకు శ్రీ మందుముల రామచంద్రరావు, హైకోర్టువకీలు గారును, (౨) వర్తకసంఘ స్థాపనోత్సవసభకు కేంద్రసంఘ కార్యదర్శియు (3) యువజనసంఘ స్థాపనోత్సవ సభకు శ్రీ దేవులపల్లి రంగారావు వకీలు గారును అధ్యక్షత వహించియుండిరి. (గోలకొండపత్రిక ౧-౧౦-౧౩౩౭ ఫ. =౭-౭-౧౯౨౮).

## నల్లగొండ సభలు.

పిమ్మట పేర్కొనదగినవి నల్లగొండఆంధ్రసభలు. ఇవి ౨౧, ౨౨ మెహరు ౧౩౩౭ ఫ. (౨౭, ౨౮ ఆగస్టు ౧౯౨౮) తేదులలో సమావేశపరుపబడినవి. బాబెహుకూమతు ఆజ్ఞ పొందనిది ఈసభలు జరుపకూడదని నల్లగొండజిల్లా మొహతమిముగారు సభల తేదులకు ౬ దినములముందు ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీ పులిజాల వేంకటరంగారావు, హైకోర్టువకీలు గారికి తెలిపిరి. వ్యవధి తక్కువగానున్ననుమన ఎన్నియో ఉకుకీలు పరుగులు పెట్టి నగరమునకువెళ్లి, పోలీసు శాఖకు ఆంగ్ల మంత్రిగా నుండిన టి. జే. టాస్కరుగారివద్ద దరఖాస్తు పెట్టుకొనగా, వారి యనుగ్రహమూలమున, హోము సెక్రటరీ నవాబ్ జుల్కదర్ జంగ్ బహాదరుగారు వెంటనే సెలవొసగి♦ బాబె

ఈ సభల విషయమున ప్రశంస చేయునప్పుడు (కీ. శే) గారు వేంకటరామయ్యగారిని వర్తకనాయకులు చెప్పదగినవారు. వీరు వర్తకుల యవస్థలను చక్కగా వర్ణించిరి: "వీరు పూర్వపద్ధతివారును, వృద్ధులును అయ్యు యౌవనులమించిన యుత్సాహముతో వర్తకులవిషయములందే కాక స్త్రీవిద్య, స్త్రీ పునర్వివాహము మున్నగు సంస్కార విషయములగూర్చి అనుకూలముగా ప్రసంగించిరి." [గోలకొండపత్రిక ౧-౧౦-౧౩౩౭ ఫ.] వీరి పటము దొరకనందునకు చింతిల్లుచున్నాము.

♦ ఈ సభలకు సెలవియ్యవలయునను సిఫారసుచేయుచు నవాబ్ సాహెబుగారు వ్రాసిన వాక్యరత్నము లివి:– "ఈ సభలలో రాజకీయ



కీ. శే. షబ్నవిసు వేంకటరామ నృసింహారావుగారు.

(నీలగిరి పత్రికా సంపాదకులు)

హుకూమతు ఆజ్ఞను పొందెదమని వారే అభయమిచ్చి కార్యకర్తలను పంపిరి.

---

లుండునని వీరు (కార్యకర్తలు) ఒప్పుకొనుచున్నారు. మరియు ఇద్దరు (ప్రభుత్వపు) అధికారులు సభలకు అధ్యక్షులుగా నున్నారు. విషయములు వ్యవసాయము, సంఘములోని లోపములను సంస్కరించుట యైయున్నవి. ఈసభలకు సెలవొసంగుటకై గుజారిషు పంపవలసినది." (గోలకొండ పత్రిక ౧౯-౧౧-౧౩౩౭ ఫ.)

ఇట్టిసభల జరుపుకొనుటకు జనులు ఇన్ని కష్టములపాలు కావలసి వచ్చినది!

జరిగిన సభల వివరములు:—

(౧) వ్యవసాయకులసభ: (అధ్య) పండిత కేశవరావు, హైకోర్టు వకీలు. (వీరు కొంతకాలము హైకోర్టు జడ్జిగానుండిన గొప్పవారు) దీనికి అధ్యక్షులుగా మొదటి జిల్లా తాలూకుదారుగారు అంగీకరించియుండిరి. కానిపనుల వలన రాజాలమని తరువాత తెలిపిరి!

(౨) స్థానిక గ్రంథాలయ వార్షికోత్సవసభ. (అధ్య) శ్రీరామచంద్ర నాయకుగారు ఎం. ఏ. బారిస్టరు. వీరు హైదరాబాదు హైకోర్టులో న్యాయమూర్తులుగా పనిచేసి ఇటీవల ప్రధాన న్యాయాధిపతిగా నున్నారు.

(౩) సంఘసంస్కారసభ. (అధ్య) శ్రీసురవరము ప్రతాపరెడ్డిగారు బి. ఏ. బి. ఎల్.

(౪) వర్తకులసభ. (అధ్య) శ్రీ గౌరు వేంకటరామయ్యగారు.

"ఈ సభలకు స్థానిక అధికారులలో పోలీసు మొహతమిము, ఆప్కారీ మొహతమిముగార్లు విచ్చేయుటచే శోభకలిగెను! వ్యవసాయ శాఖవారు మాత్రము ఉపన్యాసకుని పంపలేదు. స్థానిక పశువైద్య శాఖ

విఖ్యాతులగు మహారాష్ట్రనాయకులు మన ఆంధ్రసభ లకు వచ్చి ప్రధానకర్తవ్యముల నెరవేర్చుట ఇది రెండవసారి. మొదటిసారి దేశభక్త వామననాయకుగారు సూర్యాపేటలో, అంతకు మూడునెలలకు పూర్వము, ఆంధ్రగ్రంథాలయ మహా సభకు అధ్యక్షులై దానిని విజయవంత మొనర్చిరి. ఆంధ్రోద్య మము విషయమున మహారాష్ట్ర సోదరులలో ఈ విధముగా ప్రారంభమైన గౌరవము కాలక్రమమున హెచ్చుటయు, తరు వాత కొన్ని సంవత్సరములకు ఆంధ్రోద్యమము ననుసరించుచు నిజాంరాష్ట్ర మహారాష్ట్రోద్యమము ప్రారంభమగుటయు పాఠ కులు ముందు చూడగలరు.

మొత్తముమీద నల్లగొండలో సభలు చాల జయప్ర దముగా జరిగినవి. సభల సమావేశ పరచుటలో కలుగుచున్న యిబ్బందులను తొలగించుటకై గ్రంథాలయ వార్షికోత్సవసభ లో నొక తీర్మానము ‡ అంగీకరించి ప్రభుత్వమువారికి పంప

---

నారుకూడ ఇట్టి అమూల్య సమయము వినియోగపరచుకొనలేదు.''

(గోలకొండ పత్రిక ౨౩-౧౧-౧౩౩౮ ఫ.)

‡ తీర్మానములో నిట్లున్నది:—

'' శ్రీనిజాంప్రభువుగారి ౧౩౪౦ హిజ్రి, మొహర్రం౧౯ తేదీఫర్మానుకు వ్యతిరేకముగను, ఉన్నత న్యాయస్థానమువారి తీర్పునకు భిన్నముగను, అధి

బడినది. అదియు నొక విశేషము. ఈ తీర్మానముకూడ నిష్ఫలమే యైనది.

ఈ సభలలో, శ్రీరామచంద్రనాయకుగారి యొక్కయు, పండిత కేశవరావుగారియొక్కయు అధ్యక్షోపన్యాసములు ఉర్దూ భాషలోజరుగుట యొక్క ప్రత్యేకాంశము. వారిరువురును ఆంధ్ర భాషలో ఉపన్యసించుటకు తగినంత తెలుగుభాషా జ్ఞానము తమకు లేనందున అంధ్రేతరభాషలో మాట్లాడవలసివచ్చినందు లకు విచారము దెల్పియుండిరి.

బయటనుండి వచ్చిన ప్రముఖులలో పైనచెప్పిన మహా రాష్ట్రసోదరులను (కీ. శే.) శ్రీనివాసరావుశర్మ బారిష్టరుగారును కాక, ఆంధ్రప్రముఖులుపలువురు† ఉండుటయు, సంఘాభివృద్ధి

---

కారులు, విద్యావిషయిక, సాంఘిక, వాణిజ్య, వ్యావసాయవిషయికసభల జరుపుటకై, ప్రభుత్వసభ(బాబెహుకూమతు)వారి అనుమతి పొందవలయు నని విధించుట, దేశాభివృద్ధికిఆటంకము కలిగించుచున్నది.కనుక రాజకీయే తరసభలు జరుపుటకై అట్టి అనుమతి అనవసరమని ఫర్మానుదయచేయుటకై ఈసభవారు శ్రీనిజాంప్రభువర్యుని సవినయముగా ప్రార్థించుచున్నారు.” (గోలకొండ పత్రిక: ౨౩-౧౧-౧౯౩౦ ఫ)

† అట్టివారిలో కేంద్రసంఘ కార్యదర్శికాక, ఈ క్రింది మహా శయుల నామములు వచ్చినవి:— [౧] శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు [౨] శ్రీ మందుముల నరసింగరావుగారు [౩] శ్రీశాడేపల్లి మృత్యుంజయ

కవసరములగు అనేక విషయములపైన వారుపన్యసించుటయు చెప్పదగిన యంశము.

ఈ సభలవలన ఆంధ్రోద్యమము మరియొక మెట్టు ముందునకు సాగినదని చెప్పుటలో సందేహము లేదు.

తి ప్ప ర్తి స భ లు.

నల్లగొండ జిల్లాలోని యొక పల్లెటూరునందు జరిగిన సభలను గురించి వ్రాసి దీర్ఘములైన ఈ సభల వృత్తాంతములను వదలెదము.

---

రావుగారు ఎం. ఎస్సి, ఎల్. ఎల్. బి. హైకోర్టువకీలు [వీరిప్పుడు ఉస్మానియా విశ్వవిద్యాలయములో ప్రకృతిశాస్త్ర ఉపన్యాసకులు] [౪] కీ. శే. శ్రీ భాగ్యరెడ్డి వర్మగారు [౫] శ్రీ అరిగె రామస్వామిగారు [తుదివారు ఇరువురు హరిజననాయకులు] [౬] [కీ. శే.] శ్రీకోదాటి రామకృష్ణారావుగారు బి.ఏ,ఎల్. ఎల్. బి. [౭] కీ. శే. శ్రీ గౌరు వేంకటరామయ్యగారు [౮] శ్రీ మందుముల రామచంద్రరావుగారు [౯] శ్రీ వనమాముల నృసింహశర్మగారు బి.ఏ. ఎల్. ఎల్. బి. హైకోర్టువకీలు [వీరిప్పుడు సికిందారాబాద జిల్లాన్యాయాధీశపదవి నలంకరించియున్నారు] జీడికల్లుక్షేత్రనివాసులగు శ్రీగంగులశాయి రెడ్డిగారి ఉపన్యాసము గ్రామస్థులలో మహోత్సాహము కలిగించెను. సూర్యాపేట మిర్యాలగూడెపు సభలలోవలెనే ఈసభలకును దూరదూరము నుండి పల్లెటూళ్ల ప్రజలు పలువురు వచ్చిరి. వారికి వలయు సౌకర్యములు కార్యకర్తలును, ఆహ్వానసంఘమువారును కల్పించిరి.

తిప్పర్తియను నీగ్రామము నల్లగొండనుండి మిర్యాల గూడెమునకు వెళ్ళుమార్గమున నున్నది. ఇచ్చట ఆంధ్రోద్యమ ప్రచారమునకై కొన్ని బహిరంగసభల నేర్పాటు చేయదలచి స్థానిక వర్తకప్రముఖుడగు శ్రీ పబ్బతి ఎల్లయ్యగారు ౧౭, ౧౮ ఆబాన్ ౧౩౪౭ ఫ. (౨౧, ౨౨ సెప్టెంబరు ౧౯౩౮) దినములను నిశ్చయించి దరఖాస్తు ఇచ్చుకొనెను. ఎప్పటివలెనే పోలీసు మొహతమిం ప్రభుత్వాజ్ఞ కావలె ననెను. ప్రయత్నము లోననే ఆ తేదులు గడచి, వేరు తేదులు, ౬, ౭, దై ౧౩౩౭ ఫ. (౧౦, ౧౧ నవంబరు ౧౯౩౮) నిర్ణయించుకొని సెలవుకోరబడెను. ఆ తేదులవరకు కూడ సెలవు దొరకలేదు. ఎన్నో దినములు గడచిన తరువాత హోంసెక్రెటరీ ఆజ్ఞ దొరకెను. తుదకు మూడవమారు, ౧౩, ౧౪ ఫర్వర్ది ౧౩౩౮ ఫ. (౧౪, ౧౫-౧౯౩౯) తేదులు నిర్ణయించుకొనబడి ఆదినములలో సభలు†

---

† సభల వివరములు:—

౧. స్థానిక గ్రంథాలయసభ [అధ్య] శ్రీ పులిజాల వేంకటరంగారావుగారు.

౨. వర్తకసంఘసభ [అధ్య] శ్రీమందుముల రామచంద్రరావుగారు.

౩. రైతులసభ [అధ్య] శ్రీసురవరపు ప్రతాపరెడ్డిగారు, బి.ఏ బి ఎల్.

౪. భజనసమాజసభ [అధ్య] శ్రీ బి. కిషన్‌రావుగారు.

మొదటి మూడు సభలలోను ఉపయోగకరములగు అనేక తీర్మానములు అంగీకరింపబడినవి.

సమావేశ పరచుకొన బడినవి.

---

సభలో పాల్గొనిన జనులసంఖ్య ౧ వేయి. హైదరాబాద, నల్లగొండ సూర్యాపేటనుండియే కాక, అనేకులు, వర్తకులు, రైతులు చుట్టుపట్టుల గ్రామములనుండివచ్చిరి. నల్లగొండలోని ప్రముఖులగు న్యాయవాదులు, శ్రీ ముప్పవరము నారాయణరెడ్డిగారు, శ్రీ పి. శ్రీనివాసరెడ్డిగారు బోయినపల్లి వెంకటరామనరసింహారావుగారు, శ్రీ ఆదినారాయణగుప్తగారు [మిర్యాలగూడెము] మున్నగువారు కార్యక్రమమున పాల్గొనిరి. నగరము నుండి కేంద్రసంఘ కార్యదర్శి, శ్రీమందుముల నరసింగరావుగారు, మౌల్వీ ఫజులుర్రహమాన్ సాహెబ్ ఎం.ఏ [వీరిప్పుడువిద్యాశాఖనాజము]మున్నగువారు వచ్చియుండిరి అహ్వానసంఘమువారు సర్వసౌకర్యములు కల్పించిరి.

“వర్తకస్వాతంత్ర్యము” అను లఘుపుస్తకము ఈ సందర్భముననే అచ్చొత్తింపబడి ప్రకటితమైనది. వర్తకుల సభకు అధ్యక్షత వహించుటకు ఈ పుస్తకమును శ్రమలకోర్చి సిద్ధపరచిన శ్రీమందుముల రామచంద్రరావుగారే ఎన్నుకోబడుట విశేషము. ఈ లఘుపుస్తకముయొక్క ఉర్దూప్రతులుకూడ ముద్రితములై తిప్పర్తిసభల సందర్భమున పంచిపెట్టబడెను. వీనిని ప్రకటించు వ్యయభారమును ఇచ్చట అహ్వానసంఘమువారు-ముఖ్యముగా శ్రీ పబ్బతి ఎల్లయ్యగారు- భరించియుండిరని మాకు జ్ఞాపకము. ఈసభల గురించి ఇట్లు పత్రికలలో ప్రకటింపబడినది:-

“తిప్పర్తి చిన్నగ్రామమైనను, విశేషముగా వర్తకులచే నిండినదైనను, రైతులు తెలియనివారైనను, ఇచ్చటివారియుత్సాహము, కార్యదీక్ష యితర గ్రామములకేకాదు, తాలూకాస్థలములకును, మహబూబునగరము వంటి జిల్లాలకును, ఆదర్శప్రాయమైనదని చెప్పవచ్చును.” గోలకొండ పత్రిక ౧౪-౫-౧౩౩౯ ఫ. ౧౯-౫-౧౩౩౮, ౨౬-౫-౧౩౩౮ ఫ.

తిప్పర్తి సభలు చాల జయప్రదముగా జరిగినవి.♦ వీనివలన ఆంధ్రోద్యమము కొంత బలపడినదనుట నిస్సంశయము. ఇచ్చటి దేశముఖుగారు, "సంఘమును భంగము చేసెద" నని ఎల్లయ్యగారిని చాల బెదరించిరట! తుదకు దొరవారే ఓడిపోయిరి!

పైన వివరింపబడిన గొప్ప సభలును నల్లగొండ జిల్లాలోనే జరిగినవి. వీనివలన అచ్చటి జనసామాన్యములో—ముఖ్యముగా వర్తకులలోను, రైతులలోను—ఎక్కువ ప్రబో

---

♦ తిప్పర్తిసభలోని యొక విశేషము, తీర్మానములు ప్రతిపాదించి యంగీకరింపబడుట. తీర్మానముల విషయములు కొంత క్రొత్తదనము గలిగి యుండెను:— (౧) రైతుసంఘము తిప్పర్తిలో స్థాపింపబడినది. [౨] లోకల్బోర్డు కమిటీలకు ప్రజా ప్రతినిధులను ఎన్నుకోవలయును. [౩] నిర్బంధ ప్రారంభవిద్యను నగరమందే కాక జిల్లాలయందును ప్రవేశపెట్ట వలయును. [౪] వ్యవసాయ విద్యల దేశభాషలలో నేర్పుటకై పాఠశాలల నేర్పాటు చేయవలయును. [౫] గ్రామపంచాయతి సభల నేర్పరచుటకు గాను శాసనము గావించి, పంచాయతీలను స్థాపించవలయును. [౬] మున్సఫీ అదాలతు యొక్కయు, రిజిస్ట్రారులయొక్కయు కార్యచర్యలు దేశభాషలలో జరుపవలయును.

ఇవిగాక, [కీ. శే.] పింగిలి జనార్దనరెడ్డిగారు బర్లిను నగరమందు అకాలమృత్యువు వాతబడినందునకు ఈ సభలో విచారము ప్రకటించబడినది. రాజకీయేతరములగు సభల సమావేశపరచుటలో నిర్బంధములు లేకుండ చేయవలసినదని ప్రభుత్వమువారిని ప్రార్థించనైనది.

ధము కలిగినది, ఇతరజిల్లాలలోకూడ పలుతావుల ఇట్టిసభలు జరిగినవి. ప్రభుత్వమువారు రాజకీయేతరములగు సభలను జరుపుటలోకూడ ఆటంకములు కల్గించక యుండినచో, సభల మూలమున ఇంకను ఎక్కువ ప్రచారము జరిగియుండును. కాని అధికారుల కిది యిష్టములేక, అసంబద్ధములగు జవాబులిచ్చుటయు, చివరకు బాబెహుకూమతు కూడ, సామాన్యసభలకును, అంగీకార మొసగకపోవుటయు జరిగినది! అట్టివివరముల తెల్పబూనినచో ఒక గ్రంథమే కాగలదు కనుక ఆప్రియత్నమును వదలుకొనుచున్నాము.

## వా ర్తా ప త్రి క లు.

నవీనకాలములో ఎట్టియుద్యమమునకైనను ప్రచారము సాగుటకు వార్తాపత్రికలు చాల ముఖ్యములు. కనుక మన ఆంధ్రోద్యమముయొక్క మొదటిదశయందు ఈరాజ్యములో ప్రచురింప బడసాగిన మూడువార్తాపత్రికలు ప్రధానసాధనములైనవి.

ఉద్యమమారంభమైన తరువాత, తొమ్మిది నెలల పది దినములకు, నల్లగొండనుండి 'నీలగిరి' యను వార్తాపత్రిక ప్రకటింపబడ సాగినది. దీని మొదటి సంచిక ౧౫-౧౧-౧౩౩౧ (౨౪-౮-౧౯౨౨) ఫసలినాడు వెడలినది. తరువాత మూడు దినములకే, వరంగల్లుజిల్లా మహబూబాబాదు (మానుకోట)

తాలూకాలోని ఇనుగుర్తియను గ్రామమునుండి మరియొకవార పత్రిక "తెనుగుపత్రిక" యను నామముతో ప్రకటితమగుట ఆరంభమైనది.(౨౧-౧౧-౧౩౩౧ఫ=౨౭-౮-౧౯౨౨) మొదటి పత్రికకు (కీ. శే.) శ్రీమన్నవీను వేంకటరామనరసింహారావు, ముక్తెదారు, సంపాదకత్వము వహించిరి. రెండవ పత్రికకు డాక్టరు బద్దిరాజు సీతారామచంద్రరావు, దేశముఖుగారు సంపాదకులుగా పనిచేయుచుండిరి. వీరిసోదరులగు శ్రీరాఘవరంగారావుగారు సహాయసంపాదకులుగానుండి పత్రికకార్యము నిర్వహించుచుండెడివారు. రెండు పత్రికలును సమర్థులగు సంపాదకమహాశయులచే నిర్వహింపబడుచు, అయిదు సంవత్సరముల కాలము * నిజాంరాష్ట్రాంధ్రులకు విజ్ఞానమును ప్రబోధమును కలిగించుటకు అపారముగా కృషిసల్పిరి.

ఆంధ్రోద్యమ మారంభమైన నాల్గుసంవత్సరముల ఆరు మాసముల తరువాత, హైదరాబాదు నగరమునుండి "గోలకొండ పత్రిక" యను అర్ధవార వార్తాపత్రిక వెలువడుట మొదలైనది. దీని మొదటిసంచిక ౫తీరు౧౩౩౫ఫ. (౧౦-౫-౧౯౨౬)

*"నీలగిరి" "తెనుగుపత్రిక" లుతరువాత ఆగిపోవుటవలన తెలంగాణమునకును, ఈరాష్ట్రమున చాలకాలమునుండి వెనుకబడియున్న ఆంధ్రభాషా ప్రచారమునకు అమితనష్టము కలిగినదని మాతలంపు.

నాటిది. దీని సంపాదకత్వము వహించినవారు శ్రీ సురవరము ప్రతాపరెడ్డి బి. ఏ. బి. ఎల్. గారు.

పైన చెప్పిన మూడు పత్రికలను, మనరాజ్యమున ప్రకటించ నారంభించిన ముగ్గురు మహాశయులు, అకుంఠితమగు దేశాభిమానముతోను, మాతృభాషకు సేవయొనర్పవలయునను అచంచల కార్యదీక్షతోను, అత్యంత త్యాగభావప్రేరితులై ప్రశంసనీయముగ కర్తవ్యనిర్వహణ మొనర్చినారు. ఈ మూడు పత్రికలలో, చివరది రాజధానీ నగరమునుండి వెడలినది. తక్కినవి రెండును జిల్లాలలో ప్రకటించబడుచుండెను. ఆ రెంటిలో నొకటియగు తెనుగుపత్రిక, జిల్లాస్థలముగాని, తాలూకా స్థలముగాని కాక, పల్లెటూరినుండి ప్రకటింపబడు చుండెనని తెలిసికొనినప్పుడు, సంపాదకమహాశయులు ఆకాలమున నెంతటి కష్టములకులోనై ఈపనిని నెరవేర్చుచుండిరో సులభముగా నూహించవచ్చును. మొత్తముమీద, ఎన్నియోశ్రమలభరించి వెలి వడుచుండిన పైపత్రికలు ఆంధ్రోద్యమవ్యాప్తికై చేసిన సేవ ఇంతింతని చెప్పుట దుస్సాధ్యము. ముఖ్యముగా ప్రారంభ కాలమున, "నీలగిరి" "తెనుగుపత్రిక"లవంటి తెనుగు వార్తా పత్రికలు దేశమున లేకయుండినచో, ఆంధ్రోద్యమమునకు ఈ పాటి వ్యాప్తి, వికాసములు లభించియే యుండకపోవునని చెప్పి

నచో, అందేమాత్రము అతిశయోక్తి యుండజాలదు.

ఆకాలమున బ్రిటిషు ఆంధ్రప్రాంతమునుండి వెడలుచుండిన తెనుగుపత్రికలు, ఇచ్చటిఆంధ్రోద్యమవార్తల నప్పుడప్పుడు ప్రకటించుచుండెను. అయినను వానివలన తగినంత— అవసరముగా నుండినంత—సహాయము లభించలేదు. అది సహజమే. అవి దూరస్థలములుగానుండుట యొకకారణము. బ్రిటిషిండియాలోని ఉద్యమముల బాహుళ్యమువలన, ఇచ్చటియుద్యమముల నెక్కువగా ప్రోత్సహించు నవకాశము వానికి లేకయుండెను. ఇంతేకాక, రాజకీయముగా, నిజాంరాష్ట్రాంధ్రదేశము భిన్నపరిస్థితులకు లోబడియుండినందున ఇచ్చటి వారిసమస్యలన సరిగా గ్రహించుటఅచ్చటిపత్రికారచయితలకును, దేశారాధకులకును ఆకాలమున వీలు లేకయుండెను. ఈకారణమువలన నిజాం రాష్ట్రములోని ఆంధ్రోద్యమము ఇచ్చటి తెనుగుపత్రికల యాశ్రయమునే నమ్ముకొని, వానిపైననే ఆధారపడవలసిన దయ్యెను. ఇట్టిస్థితిలో, మనరాష్ట్రములోని పత్రికలు చేసినసేవ ఎంత యమూల్యముగా నుండెనో వేరుగా చెప్పవలసిన పని యుండదు.

# తెలంగాణా ఆంధ్రోద్యమము.

## ౧౧

### సింహావలోకనము

### ఉద్యమముయొక్క మొదటిదశ.

గడచిన పది ప్రకరణములలో మొదటిదానియందు మన రాష్ట్రములో ఆంధ్రోద్యమ మనునది ప్రారంభమగుటకు పూర్వముండిన స్థితిగతులు వర్ణింపబడినవి. తరువాతి తొమ్మిది ప్రకరణములలోను ఉద్యమము మొదలగుటయు, కార్యకర్తలు చేసిన కార్యములును వివరించబడినవి. ఇవి, ౧౩౩౧ ఫ. నుండి ౧౩౩౯ ఫ. (౧౯-౨౨-౧౯౩౦) వరకుగల కాలపు సంగతులు మాత్రమే. అనగా ఇదినిజాంరాష్ట్రపు ఆంధ్రోద్యమముయొక్క మొదటిదశ యని మాయభిప్రాయము, ఇది ఆంధ్రోద్యమారంభమునకు మూలమనదగిన హైదరాబాదు ఆంధ్రజనసంఘస్థాపనము(౮ దై౧౩౩౧ ఫ.)నాటినుండి, జోగిపేటలో సమావేశమైన మొదటిఆంధ్రమహాసభ (౩౦అర్దిబెహిష్తు౧౩౩౯ ఫ.= మార్చి ౧౯౩౦)నాటివరకు గడచిన ఇంచుమించు ఎనిమిదిసంవత్సరముల మూడుమాసముల కాలమువరకు వ్యాప్తిచెంది యున్నవి.

### అల్పారంభము

ఇది మన ఆంధ్రోద్యమమునకు బాల్యదశ యని చెప్ప వచ్చును, ఈదీర్ఘకాలమునందు మనము నిజాంరాష్ట్రములోని

ఆంధ్రులందు పరస్పరసానుభూతి కలిగించి వారి యభివృద్ధికై మనకు దైవమును, ప్రభుత్వమువారును ఒసగిన అల్పశక్తులను ఉపయోగించుకొనుటతో తృప్తిపొంద వలసినవార మైతిమి. గొప్పవాంఛలుగాని, గొప్పఆదర్శములుగాని పెట్టుకొను ధైర్యముగాని సామర్థ్యముగాని ఆకాలమున మనకు ఉండలేదు. ప్రజలలో ప్రజాహితకార్యములను గూర్చిభావములుచాలతక్కువగా నుండెను. కార్యకర్తలు లేకయే యుండిరని చెప్పినను అతిశయోక్తి కాదు. అట్టికాలములో, మనరాష్ట్రమందు నివసించుచున్న ఆంధ్రులలో "మేముఆంధ్రులము" అను భావమును ఏదోవిధమున కలిగించుటయే ముఖ్యకర్తవ్యమై యుండెను. ఆకాలపు మన కార్యక్రమము ఎంతో సాధారణమైనదిగా నుండవలసి వచ్చినది. కావుననే, ఆంధ్రజన కేంద్రసంఘము వారు,మహాసామాన్యమైనదియు, ఎట్టిచిక్కులకును, ఘర్షణములకును తావొసగనట్టిదియు, ప్రభుత్వముతోగాని, వారి యధికారులతోగాని వాదవివాదములకు ఎక్కువ చోటియ్యనిది యునగు కార్యవిధానమును మన యుద్యమవ్యాప్తికొరకుఅంగీకరించి యుండిరి. దానికి లోబడియే ఈయెనిమిది సంవత్సరములకు కొలదిగా మించిన ప్రథమదశాకాలము,ఓపికతో గడుపబడినదని వ్యక్తమగుచున్నది.

## ప్రభుత్వాధికారులవైఖరి.

ఉద్యమముయొక్క ఈ మొదటిదశయందు ప్రభుత్వాధికారులవైఖరివిచిత్రముగా నుండెనదనవచ్చును. ప్రభుత్వపు భాష కానట్టి యొకభాషను వ్యాపింపజేయుయత్నములు,ఆంధ్ర గ్రంథాలయ పఠనాలయముల స్థాపనము, వాని వార్షికోత్సవములు,వర్తకుల యిబ్బందులను వెట్టిచాకిరి చేయువారి కష్టములను తొలగించుటకై ప్రయత్నములు, ప్రభుత్వమువారి శాసనములను నియమములను పరిశోధించి, వాని యాధారముపై ప్రజలను ప్రబోధించుట, వినయపద్ధతిన అధికారుల సహాయము కోరుట, తమ సభలకు ప్రభుత్వమువారి వ్యవసాయ, పశుచికిత్స సహకార,వైద్యమున్నగు ప్రజాహితకరములగు శాఖలవారినాహ్వానించి ప్రదర్శనములను ఉపన్యాసములను చేయుటకై వారిని ప్రార్థించుట, మతసంబంధమైనపాక్షికసమస్యలను, ఉపన్యాసములందును, వ్రాతలందును రానీయకుండుట, ఇత్యాదికార్యములు ప్రభుత్వాధికారులలో ఉద్యమనిర్వాహకులపట్ల అనుమానమును ఉద్భవింపజేసినట్లు తోచును. అయినను, సభాసమావేశకులు కోరినప్పుడు ఆయా ప్రభుత్వశాఖల ఉద్యోగులు సహకారము నెఱపుట మాసలేదు. పోలీసుశాఖవారు, సభలు చేయువలదని నిషేధించుచుండగా, సహకార శాఖవారు తమ ప్రచారకులను ఉపన్యసించుటకై పంపుచుండుటచూడ వివిధప్రభుత్వశాఖలలో

కేంద్రీకృతమగు విధానము(పాలిసీ)లేదేమోయని తోచుచుండి నను, అట్టిపొరపాటులు తరువాత అధికారులు తొలగించుకొని సభలయంగీకారము వచ్చినదని తెలిసికొననిచ్చి, తమఉద్యోగుల సంపజాలమని తెలుపుట నేర్చుకొనినట్లు కానవచ్చుచున్నది. * మొత్తముమీద మొదటిదశలో క్రమక్రమముగా ఉదృతము పట్ల ప్రభుత్వాధికారుల అనుమానము హెచ్చుచువచ్చినది కాని తగ్గలేదు. అయినను నేరారోపణ కేమాత్రమువారికిసందు

* సూర్యాపేట సభల ఆహ్వానసంఘమువారు ప్రభుత్వమువారిపారిశ్రామిక వాణిజ్యశాఖవారి సహాయమును కోరగా వారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి.

" I find that there are definite Govt orders regarding the holding of public meetings. If you can send me copy of an order from the First Talukdar, permitting you to hold your meeting, then I shall be only too glad to help you in the way you suggest. (Director General's letter No. 555 of 19—5—1928.

[బహిరంగసభల సమావేశపరచుటకు ప్రభుత్వమువారికొన్నిపత్యేకఆజ్ఞలు కలవని తెలియనున్నది. మీరు సభలు జరుపుకొనవచ్చునని అవ్వాలు తాలూకుదారు గారిచ్చిన అనుమతి పత్రిపు నకలు పంపినచో మీరు కోరిన విధమున పహాయముచేయుట నాకుచాల సంతోషప్రదముగా నుండగలదు.)

(పారిశ్రామిక వాణిజ్యశాఖడైరెక్టరు జనరలు లేఖ సం॥ ౫౫౫, తేది ౧౯-౫-౧౯౨౮.)

దొరకలేదు. మ.ఘ.వ. ప్రభువుగారి ఫర్మాను (౩-౧౨-౧౩౩౦ ఫ.) ను అందగాగొని సభలు సాగకుండ చేయుపద్ధతి ౧౩౩౫ ఫ.వరకు తీవ్రముగా హెచ్చెను. ఆసమయమువరకు పోలీసు శాఖపైన ఆంగ్లమంత్రుల పాలనము వచ్చినందున ఫర్మానులోని నియమములకు లోబడియే యగుగాక, ఆలస్యముగానైననరే, ఎన్నో హిరణ్యాక్షవరము లనదగిన షరతులతో సభల సమావేశమునకు అనుమతి దొరకసాగెను. ఆజ్ఞ నిచ్చునప్పుడుగూడ, కేంద్రసంఘకార్యదర్శిని "ఇట్లు చేయువలదు. అట్లు చేయువలదు" అని హెచ్చరించుట జరుగుచుండెను. ♦ ఈ దశయంతయు ఇట్లే గడచినదని చెప్పవచ్చును.

---

♦ ఒక ఉదాహరణము గమనించదగినది. రెండేండ్ల భగీరథ ప్రయత్నముల మీద సూర్యాపేట సభలకు [౧౩౩౭] ప్రభుత్వమువారు బాబెహుకూమతు నుండి అనుజ్ఞ ఒసగగా, జిల్లాల పోలీసుశాఖాధ్యక్షుడగుమహాశయుడు కేంద్రసంఘ కార్యదర్శికి ఇట్లు వ్రాసెను:—

"Govt is pleased to permit the holding of meetings at Suryapet......on the distinct understanding that the meetings will strictly be non-political and of such nature that there will be no liklihood of bringing about any political consequences. The secretary of the conferance will be held responsible if anything against Govt. orders transpires" (Director General of District Police letter No. 833 of 28—5—1921.)

[సూర్యాపేటలో సభలుసమావేశపరచుటకు ప్రభుత్వమువారు అనుమతినిచ్చి యనుగ్రహించినారు. అయినను ఇదియొక స్పష్టమగు షరతుపైన

## "ఉద్యమము రాజకీయమేమో?"

ఉద్యమముయొక్క ఈదశలో నమావేశపరుపబడుచున్న సాధారణ సభలకు అనుమతి నిచ్చుటలో ఇంతదీర్ఘమగు పత్రవ్యవహారములు, కాలయాపనము, హెచ్చరింపులు ఏల కలుగుచుండెను? ప్రభుత్వమువారికి ఈ యుద్యమముయొక్క భవిష్యత్స్వరూపమును గురించి అప్పుడప్పుడు కలుగుచుండిన అనుమానమే కారణమని ఊహించవచ్చును. ఆయనుమానమేమి? " ఇది

---

సాధారణపడి యున్నది. సభలు కఠినముగా రాజకీయేతరములయి యుండవలయును. అవి రాజకీయ పరిణామములను కలిగించునను అనుమానములో పడేయని స్వభావముకలవిగా నుండవలయును. ప్రభుత్వమువారి ఆజ్ఞకు భిన్నముగా ఏదైనసంభవించినచో, దానికి సభల కార్యదర్శి జవాబుదారై యుండగలడు. "(జిల్లా పోలీసుశాఖాధ్యక్షుని లేఖ నం: ౮౩౩ తేది ౧౭-౫-౧౯౩౭.)

(ఇచ్చట కార్యదర్శి యనగా కేంద్రసంఘ కార్యదర్శియని యర్థమో లేక, ఆహ్వానసంఘ కార్యదర్శియని అన్వయమో స్పష్టముగా జెప్పవీలు లేదు. ఇది ప్రభుత్వమువారి ఘనబుద్ధికే తోచవలయును!)

ఇట్టి ఆజ్ఞలు, హెచ్చరింపులు కేంద్రసంఘ కార్యదర్శికి ఎన్నియో మార్పులు వచ్చినవి. ఆయన ఒకసారియైనను ప్రభుత్వాజ్ఞల నతిక్రమించిన వాడనిమాత్రము అనిపించుకొనలేదు. పోలీసు శాఖామంత్రియగు టి. జె. టాస్కరుగారికి కేంద్రసంఘ కార్యదర్శిపైనమంచివిశ్వాసముకుదిరినందున ఉద్యమమునకు బలముక్రమముగా చేకూరుట తరువాతిదశలలో కానవచ్చును.

రాజకీయోద్యమ మేమో? ప్రత్యక్షముగా నిప్పుడు రాజకీయ స్వరూపము కనపడక పోయినను, ఈ సభల సాగనిచ్చినచో వీనివలన రాజకీయ పరిణామములుకలుగునేమో?" ఇట్టి యను మానమే ప్రభుత్వాధికారుల మానసములను ఆంధ్రోద్యమ సభల ప్రసక్తి వచ్చినప్పుడెల్ల బాధించుచుండె నని తలంతుము!

"రాజకీయ సభలనగా నేవి?"

ఉద్యమ కార్యకర్తలకు రాజకీయసభలు సమావేశపరు పవలయు నను కోరిక గాని, తమ ఉద్యమమునురాజకీయముగా మార్చవలయునను వాంఛగాని, ఈదశయందు లేదనుటను కేంద్ర సంఘము నిర్ణయించిన విధానమేస్పష్టపరచుచున్నది. ప్రభుత్వ మువారి మానసముల బాధించుచున్న ఈ యనుమానమును తొలగించినచో చిక్కులు విడిపోవునుగదా యనుభావముతో, కేంద్రసంఘ కార్యదర్శి, సభలను సమావేశపరచుటలో కలుగు చున్న యిబ్బందులను, కార్యకర్తలకు విషయ నిర్ధారణలో వచ్చుచున్న కష్టములను దెలుపుచు, "రాజకీయ సభలనగా నెట్టివో స్పష్టపరచిన, అట్టివాని జోలికిపోకుండ నుందుము. అను గ్రహించి మాకది వివరించినచోకృతజ్ఞతాబద్ధులమగుదు"మని హైదరాబాదునగరములోని రక్షకభటాధ్యక్షు(కొత్వాలెబల్దా) గానుండిన శ్రీ రాజా బహాదరు వేంకటరామరెడ్డి ఓ. బి. ఇ.

గారిద్వారా ప్రభుత్వమువారికి విజ్ఞప్తి పంపుకొనెను, కాని దాదాపు రెండు సంవత్సరములకాలము గడచినను సమాధానము దొరకలేదు. † తాము వద్దని నిర్దేశించుచున్న రాజకీయ సభల స్పష్టీకరణము, లేక, నిర్వచనము తెలుపవలసినదని ప్రార్థించగా, సమాధానము రాకపోవుటయు, మాటిమాటికిరాజకీయ సభలు జరుపవలదని హెచ్చరించుచుండుటయు, కార్యకర్తలను ఎంతచిక్కులకును, విసుకునకును, లోబరుచునో. ప్రపంచజ్ఞానము గలవారెవరైనను సులభముగా నూహించుకొనవచ్చును కాని ప్రభుత్వమువారి కదిస్ఫురించలేదు! ఎంత దురదృష్టము !!

---

† కేంద్రసంఘ కార్యదర్శి కొత్వాలుగారికి వ్రాసినలేఖ నిషాన్ ౭౭౮ తేది౧౪-౬-౧౩౩౯ఫ. దీనికి జవాబు "ప్రభుత్వమువారికీవిషయమును స్పష్టపరచుటకై వ్రాసినాము. కొంచెము నిరీక్షించగలరు." (కొత్వాలు గారి లేఖ నిషాన్ ౧౧౭౭ తేది ౨౬-౭-౧౩౩౯ఫ) ఇట్టి సంగతియే కల మరికొందు లేఖలు వచ్చినవి. కేంద్రసంఘమునుండి విషయమును పరిష్కరించ వలయునని మరికొందు లేఖలు వ్రాయబడినవి. జవాబు రానందున తుదకు కార్యదర్శి ఈ క్రిందివిధముగా వ్రాసెను:—

"ప్రభుత్వము వారీవిషయమును పరిష్కరించియుందురు. అట్లయినచో తెల్పగలరు ఏదేని కారణమువలన ప్రభుత్వమువారు ఈవిషయమును స్పష్టీకరించ జాలనిచో, లేక, స్పష్టీకరించుటకు ఇష్టపడనిచో, ఆ సంగతియైనను దయచేసి తెల్పగలరు. తెలిపిన పక్షమున ఈ వ్యవహారము (కార్రవాయి) ముగించబడును." దీనికి జవాబు ఇట్లువచ్చినది:—

## సభాచర్యలలో మార్పులు.

ఆరంభ కాలమున—౧౩౩౧ ఫ. లో-జరుగుచుండిన సభలకును, ౧౩౩౭-౧౩౩౮ ఫసలీలలో సమావేశమగుచుండిన సభలకును భేదము ఏర్పడినది. మొదటిదగు ఈ దశయందు జరిగిన సభలు సాధారణముగా విడివిడిగాను, ఒక్కొక్క సంస్థకుమాత్రము సంబంధించినవిగాను ఉండినవి. తెలంగాణములోని అనేక

---

"ప్రభుత్వ కార్యాలయము వారు ఈ విషయములలో ఎట్టి స్పష్టీకరణము చేయలేదు." (కొత్వాలుగారి లేఖ నిషాన్ ౩౯ తేది ౫-౧-౧౩౪౧ ఫ.)

దీనిపైన కార్యదర్శిగారు ఒక లేఖ వ్రాసిరి. దాని సారాంశ మీ క్రిందివిధముగానున్నది:—

"తమ ఆజ్ఞ అయిన పక్షమున, వ్యవహారము సమాప్తము చేయబడును. ఈ వ్యవహారము ప్రజల లాభముకొరకు ప్రారంభించబడి, ౧౯ నెలల నుండి సాగినది. తమ వద్దనుండివచ్చిన లేఖపైన "రాజ్"(రహస్యము)అని వ్రాయబడినది కనుక, తమకును నాకును మధ్య జరిగిన పత్రవ్యవహారమును పత్రికలలో ప్రకటించుటకు సెలవిప్పించగలరు (లేఖ నిషాన్ ౩౬౩ తేది ౬-౧-౧౩౪౭ ఫ)

దీనికి పరిష్కారపూర్వకమైన జవాబు రాలేదు. ఇప్పటికి ౧౬ సంవత్సరముల కాలమగుచున్నది కనుక, అంగీకారముకొరకు నిరీక్షించక ఈ పత్ర వ్యవహారము యొక్క సారాంశమును ప్రకటించుచున్నాము. కొత్వాలు సా॥ కార్యాలయపు మిసలు సంఖ్య ౩౫౮ సం॥ ౧౩౩౯ ఫ.)

సంస్థల కార్యములను, ఆశయములను ఏక ముఖమునకు దెచ్చు ప్రయత్నము ఒక గ్రంథాలయోద్యమ విషయమునమాత్రమే జరిగినది. అట్టి మొదటియత్నము మధిరలో సమావేశమైన మొదటి గ్రంథాలయ మహాసభ. అదియు నామ మాత్రమే; ఫలదాయకము కాలేదు. (౧౩౩౮ ఫ) రెండవ గ్రంథాలయ మహాసభ సూర్యాపేటలో జరిగినది. (౧౩౩౯ ఫ.) గ్రంథాలయోద్యమమున ఈ ప్రయత్నమే నాటికిని నేటికిని తుదిదిగా పరిణమించినది. నిజాంరాష్ట్రమున కంతటికిని ఒక ఆంధ్రమహాసభ జరుపుట అవసరమని పలుమారు సూచనలు పత్రికలలో వచ్చినవి. ఈ విషయమున మొట్టమొదటి సూచన చేసినవారు బ్రిటిషు ఆంధ్రప్రాంత వాసులును, నిజాంరాష్ట్రాంధ్ర సోదరుల యభ్యుదయము మనఃపూర్వకముగా నపేక్షించు నుదారస్వభావులును నగు శ్రీ సువర్ణ శ్రీరామ నరసింహముగారు. తరువాత ఇట్టి యభిప్రాయమునే మరికొందరు నిజాంరాష్ట్రవాసులగు ఆంధ్ర కార్యకర్తలను ప్రకటించి యుండిరి. కాని అట్టి సూచనకు, ఏ కారణమువలననో కాని, ఎక్కువబలము చేకూరలేదు. బహుశః ముఖ్య కార్యకర్తలగు వారికి సభల విషయమున ప్రభుత్వాధికారులవలన కలుగుచున్న ఇబ్బందులచే అంతటి గొప్ప ప్రయత్నము చేయు ధైర్యము కలుగక పోయి యుండును. తెలంగాణా

వాసులనమిష్టి యభిప్రాయమును నిర్మించు సమయము యింకను రాలేదను భావము బలవత్తరమై యుండవచ్చును. అయినను, ౧౩౩౭ ఫ. తరువాత, ఈ విషయమున నిరుత్సాహముతగ్గినిజాం రాష్ట్రాంధ్రమహాసభ,ఏపాటిదైననుస రే,చేసితీరవలయుననుసంకల్పము స్థిరపడినది. అట్టిసంకల్పమే జోగిపేటలో ౧౩౩౯ ఫసలీ మధ్యభాగమున సమావేశమైన ప్రథమ ఆంధ్రమహా సభయని కానవచ్చుచున్నది.

మొదటినగు నీదశలో సమావేశ మగుచుండిన సభా చర్యలలోక్రమముగా అభివృద్ధిలక్షణములు కానవచ్చుచున్నవి. ప్రారంభమున కొంత కాలమువరకు సభల కార్యక్రమము ప్రచార సంబంధమైనదిగానుండెను. తరువాత, తీర్మానములు, వానిసంబంధమగు చర్చలుక్రమముగా హెచ్చసాగినవి.తీర్మానముల విషయములుకూడ క్రమక్రమముగాక్రొత్తదనమునువ్యక్తపరచునవి యైనవి. మొదటనుండిన నిర్మాణ కార్యదృష్టి తరువాత తగ్గిన లక్షణములు కానవచ్చును. ప్రజల కష్టనిష్ఠురములకును, వాంఛలకును సంబంధించిన పరిపాలనా విషయములపై ప్రు దృక్పథముమారుట ౧౩౩౭ సం॥పు సభలలోగోచరము కాసాగినది. మొత్తముమీద, ఉద్యమాభివృద్ధి లక్షణములు స్పష్టముగా కానవచ్చినవి.

## వర్తకుల సహాయము

మనయాంధ్రోద్యమముయొక్క ప్రారంభమును, ఆంధ్ర జన కేంద్రసంఘముయొక్క మొదటి సమావేశమునందు నిర్ణయింపబడిన కార్యప్రణాళికను పరిశీలన దృష్టితో చూచువారికి ఈ యుద్యమము మనరాష్ట్రపు వర్తకుల సానుభూతినిపొందగల్గునని ఏమాత్రము తోచజాలదు. విద్యాధికులగు వారిని మాత్రముఇదియాకర్షించుననియు, ఆంధ్రవాచక ప్రపంచము ఈ రాష్ట్రమున విశాలపరచగలదనియు ఆశ కలుగును. ఇట్టి స్థితిలో, వర్తకుల సహాయము దీనికి త్వరలోనే లభించుటయు, తన్మూలమున నిది అనుకొనినంతకంటె ఎక్కువగా వ్యాప్తిగాంచుటయు ఆశ్చర్యకరమని యొప్పుకొనక తప్పదు. మన దేశపు ముఖ్యముగా తెలంగాణాపు, వైశ్యసోదరులు,వర్తకులు,లాభము లేని పనులలోగాని, చిక్కులకు కారణములగునని ఏమాత్రమైనను సరే అనుమానము తోచు కార్యములలోగాని, ప్రభుత్వాధికారుల దృష్టికి వారిని గురిగా చేయగల వ్యవహారములలోగాని సాధారణముగా ప్రవేశింపసిద్ధపడరు. కనుక వారి తోడ్పాటు, సహకారము, మన ఆంధ్రోద్యమమునకు దొరికినదనగా, ఈమార్గమున నడుగుబెట్టుట వారికి ఎంత తప్పనిదిగా దోచినదో మనమూహించవచ్చును. ఈకార్యమున ముందంజ వేసిన గౌరవము సూర్యాపేట వర్తకులకును, వారి నీర్గమా

మునబెట్టిన (క్రీ. శే.) పువ్వాడ వేంకటప్పయ్యగారు మున్నగు స్థానిక కార్యకర్తలకును చెందుచున్నది. సూర్యాపేటలో వర్తక సంఘమేర్పడినతరువాత, నల్లగొండజిల్లాలోని వర్తకులందెట్టి ప్రబోధము కలిగెనో, వారికి చాల కాలమునుండి కలుగుచున్న కష్టములు ఎట్లు సులభముగా తీరెనో ఇంతకుముందు తెలుపబడినది. నల్లగొండజిల్లా వర్తకుల యుదాహరణము ఇతర జిల్లాలకును కొంతవరకు దారిచూపినది. ఆంధ్రోద్యమము యొక్క రెండవ దశయందు—ముఖ్యముగా మొదటి రెండు ఆంధ్రమహాసభలను సమావేశపరచుటయందు—వర్తకులు ఎట్టి ప్రధాన పాత్రమును వహించిరో, ఎట్లు వ్యయముల భరించిరో ఆ రెండు మహాసభల నివేదికలు స్పష్టముచేయగలవు. ఆంధ్రోద్యమ వికాసమును సూక్ష్మముగా పరిశోధించువారికీయంశము అప్రతీత పూర్వముగా తోచగలదు! *

---

* నేటివరకు, ఆంధ్రోద్యమమునకు వర్తకులు తమ కృతజ్ఞతను తెల్పుట అనుభవసిద్ధము. ఈయంశము నల్లగొండజిల్లాకు ముఖ్యముగా వర్తించుచున్నది. ఇప్పటికి రెండేండ్లముందు, గ్రంథకర్త, నల్లగొండజిల్లాలోని యొక చిన్న గ్రామములోనుండి పోవుచు, అచ్చట కనుపడిన వైశ్య సోదరులతో వారి యోగక్షేమములను విచారించగా (తమతో మాట్లాడుచున్న వ్యక్తి ఫలానివాడని తెలియకయే) తమ గ్రామములలోని వైశ్యుల కష్టములన్నియు ఇరువదియేండ్లక్రిందనే తొలగిపోయెననియు, అట్టికష్టములు

ఆ కాలమున తిప్పర్తి, సూర్యాపేట, మునగాల మొదలగు కొన్ని
చోట్ల రైతుసంఘములుకూడ స్థాపితములైనవి. కాని అవి
ఎక్కువగావృద్ధికిరాలేదు. అందునకు కొన్ని కారణములు కాన
వచ్చుచున్నవి. (౧) రైతులకుగలకష్టములు, చిక్కులుఅపరిమిత
ములుగానుండుట. (౨) గ్రామములలో వారికి ప్రమాణబుద్ధియు,
పట్టుదలయు గల నాయకులు లేకపోవుట (ఒకటి రెండు రైతు
సంఘములకు నాయకులయినవారు రైతులను ఎక్కువగా శ్రమ
పెట్టి, తాము ఈ పేరున లాభము పొందియుండుట మేమెరుగు
దుము.) (3) రైతులలో చదువువచ్చినవారు లేకయుండుట
త్యాగులు.

## కార్యకర్తల వర్తనము.

ఈయుద్యమముయొక్క మొదటిదశయందు, ప్రారంభ
మునుండి తుదివరకు హెచ్చుతగ్గులులేకుండ, సమముగా వ్యక్త
మైన లక్షణములుఏవనగా:—కార్యకర్తలలో పరస్పరసహకార

---

కలిగించిన ఉపకారము "ఆంధ్రసంఘము" వారిదనియు ఎంతోసంతోష
మును, కృతజ్ఞతను, నిశ్చింతను వారు ప్రకటించిరి! ఇది గ్రంథకర్త కెంతటి
సంతోషమును చేకూర్చెనో, చెప్పవలసిన పనిలేదు! సంభాషణముగియగానే
గ్రంథకర్త తనమార్గమున ప్రయాణము సాగించుకొనెను. తనను అచ్చటి
వారి కెరుకపరచలేదు!

సామరస్యవిశ్వాసములని చెప్పవచ్చును. ఒకరినాయకత్వమును తక్కినవారు హృదయపూర్వకముగా నంగీకరించుచుండుట, శక్తికొలది తోడ్పడుచుండుట కానవచ్చుచున్నది.

సద్భావప్రేరితులు కానట్టి కొందరు, పత్రికాముఖమున ఆక్షేపణలు చేయగా, ముఖ్యకార్యకర్తలగువారు దీర్ఘములగు ప్రత్యుత్తరములతోను సమర్థనములతోను తమకాలమును, తమ శక్తులను వృథాపుచ్చక, ఉపేక్షించుటయో, సమాధానము చెప్పక తప్పదనుకొనువోట్ల, నాల్గుమాటలలో ప్రత్యుత్తరము చెప్పి ఇట్టివిషయములలో పత్రికలందు వివాదములు సాగించుట తమకిష్టములేదను భావమును ప్రకటించుటయో కానవచ్చును.*

* ఆ కాలమున ఉద్యమప్రచార కార్యమునందు ఎక్కువగా పాల్గొనిన "నీలగిరి" వారపత్రికలో ఈ సంగతి చాలవరకు కానవచ్చును; చూడుడు: "నీలగిరి" పత్రిక ౯-౨-౧౩౩౪ ఫ. ౨౩-౨-౧౩౩౪, ౨౨-౬-౧౩౩౪: శ్రీ తూమాటి వేంకటరెడ్డిగారి వ్యాసమునకు ప్రత్యుత్తరము నీలగిరి పత్రిక ౯-౭-౧౩౩౬; శ్రీ రెడ్డిగారి లేఖ నీలగిరి పత్రిక ౩౦-౭-౧౩౩౯ ఫ. శ్రీ రెడ్డిగారి మరియొక లేఖ నీలగిరి పత్రిక ౩౦-౭-౧౩౩౭ ఫ. రెండుమూండు సులభ్యము. వానినివివరించుట గ్రంథవిస్తరమగునుగనుక వదలితిమి.

ఈదశయందు కార్యకర్తలదృష్టి నిర్మాణకార్యములం దెక్కువగా విలగ్నమైయుండెనని యూహించుటకు ప్రబలకారణములు కానవచ్చుచున్నవి. *

"పైన పేర్కొనబడిన లక్షణములు ఉద్యమముయొక్క ఆరంభదశయందు ఉండుట సహజమే. ఉద్యమ వికాసము నొందిన కొలది వానిలో మార్పులు తప్పక కలుగుచుండును" అను నభిప్రాయము త్రోసివేయ దగినదికాదు.

ఎట్లయిననేమి, కార్యకర్తల ఆ దశయందలి వర్తనము ఆంధ్రోద్యమమునకు అప్పటి ప్రజల యామోదమును, కీర్తిని సంపాదించెను. ఉద్యమమును పై మెట్టునకు ఎక్కించుటయందు ఇది చాల తోడ్పడెననియు మన రాజ్యములోని ప్రత్యేక పరిస్థితులను బట్టి సంభవించగల చిక్కులను చాలవరకు తగ్గించె ననియు మాకు తోచుచున్నది.

---

‡ సులభమైన భాషలో అనేక లఘుపుస్తకములు వేలకొలది అచ్చొత్తించి, వేలకొలది చౌకధరలకు విక్రయింపబడినవి. ఆంధ్రమున వక్తృత్వము వ్యాసరచనము, కథానికరచనము, బహుమానములద్వారా ప్రోత్సహింపబడినవి. విశ్వవిద్యాలయ పట్టభద్రులగు ఆంధ్రులు గౌరవింపబడి ప్రత్యేక సభలలో ఆంధ్రమహాశయులవలన ప్రబోధింపబడిరి. వైద్యశాస్త్రము, వాస్తుశాస్త్రముల నేర్పుచుండిన హైదరాబాదు పాఠశాలలోను, ఉస్మానియా విశ్వవిద్యాలయముయొక్క బి.ఏ. ఇంటరు, మెట్రికు ఎచ్.ఎస్.ఎల్.సి.

## ము గిం పు.

౧౩౩౧ ఫ. లో అల్పారంభముగ, వెలువడిన ఈ ఆంధ్రోద్యమము, ఎనిమిదిసంవత్సరములవరకు, అనగా, ౧౩౩౯ ఫ. లో సమావేశమైన ప్రథమ ఆంధ్రమహాసభ (జోగిపేట) వరకు మొదటిదశను పూర్తిచేసికొని, తరువాత, రెండవదశలో ప్రవేశించినది. రెండవదశయొక్క వివరములు, (దైవ మనుగ్రహించెనేని) ఈ గ్రంథముయొక్క రెండవభాగమున, పాఠకుల యెదుటకు రాగలవు.

పరీక్షలలోనుత్తీర్ణులగు ఉత్తమవిద్యార్థులు, బంగారు, వెండిపతకములతో బహూకరింపబడిరి. విద్యార్థులందు వ్యాయామపు పోటీలు పెట్టించి బహుమానములియ్యబడినవి. అముద్రితములగు పుస్తకములను, తాళపత్ర గ్రంథములను సంపాదించి (శ్రీ లక్ష్మణరాయ పరిశోధక మండలిద్వారా) కాపాడబడినవి. దేశమున వెడలిన తెలుగుపత్రికలకు చేతనైనంత సహాయము చేయుట జరిగినది. బయటినుండి ఈ రాష్ట్రమునకు దయచేసిన ఆంధ్రప్రముఖులను గారవించుటలో పాల్గొనబడినది. ఈపనులు, శక్తికిమించని ఉదార భావముతో నిర్వహించుట జరిగినది. ఈవిధముగా మొదటిదగు ఉద్యమదశలో ఆంధ్రసంస్కృతిని, ఆంధ్రసాహిత్యమును, భాషను ఈ రాజ్యమున కాపాడుటకై యత్నము జరిగినది.

# అనుబంధము.

## శ్రీ లక్ష్మణరాయ పరిశోధక మండలి.

హైదరాబాదునందు ౧౯౨౧ నవంబరు ౧౨ శనివారము నాడు ఆంధ్రజన సంఘము స్థాపితమయ్యెను. ఈ సంఘము నిజాం రాష్ట్రములోని ఆంధ్రచరిత్రసాధనములను సేకరించుట ప్రధాన కర్తవ్యముగా భావించెను. ఏతత్కార్య నిర్వాహణమునకయి ఆంధ్రపరిశోధకసంఘము ఆంధ్రజనసంఘమున కుపసంఘముగా స్థాపితమయ్యెను. (౨౭-౧౨-౧౯౨౨) ఆంధ్రజనసంఘము ఈ పరిశోధక సంఘసంబంధము వదలుకొన్న తర్వాత ఆంధ్రపరిశోధక సంఘము స్వతంత్రమయి 'శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి' యను నామముతో వ్యవహరింప సాగెను. (౬-౪-౧౯౩౧).

ఈ సంఘపక్షమున శ్రీ శేషాద్రి రమణకవులు పర్యటనముసలిపి పెక్కు తాళపత్రగ్రంథములను, శాసన ప్రతిబింబములను సంపాదించియున్నారు. సేకరించిన శాసనములలోనుండి ౧౨౩ శాసనములను సరివ్రాయించి "తెలంగాణా శాసనములు" అనుపేరుతో ఒక గొప్ప సంపుటము ప్రకటించియున్నాము. ఈ సంపుటము ఆంధ్రచరిత్రకు క్రొత్త వెలుగును ప్రసాదించినదని చరిత్రకారులు ప్రశంసించియున్నారు. తాళపత్రగ్రంథములలో పెక్కు అముద్రితములు కలవు. తాలాంకనందనీ పరిణయము,

శ్రీకృష్ణ శతానందీయము, చిలువపడిగరేని పేరణము, మధు వాణీ విలాసము అను వాటినిగూర్చి కార్యదర్శి పరిశోధించి విమర్శ వ్యాసములను వ్రాసియున్నాడు. పుస్తకముల పట్టిక ఆర్. కృష్ణమూర్తిగారి సహాయముతో సిద్ధము చేయబడినది. పరిశోధన పర్యటన నివేదికలు సిద్ధము చేయుబడినది. కరపత్రి ములుప్రకటింప బడినవి.

మునగాల సంస్థానాధీశ్వరులగు శ్రీ రాజానాయని వేంకట రంగారావు బహద్దరువారు మొదటినుండియు నీమండలి సభ్యులుగానుండుచు రు. ౧౦౦-౦-౦ లు వార్షిక భృతిగా ధనసహాయము చేసియున్నారు. మరియు "తెలంగాణా శాసనముల" ముద్రణవ్యయము లన్నియు శ్రీ రాజావారే భరించి తమ చరిత్రాభిమానమును ప్రకటించియున్నారు.

ఈ మండలిపక్షమున రు. ౨౪౯౦-౧౫-౦లు వ్యయమయినవి. శ్రీ మునగాల రాజాగారు, పింగిలి వేంకట్రామారెడ్డిగారు, రాజా రంగారావుగారు, పాపిరెడ్డిగారు, కొండా వేంకటరంగా రెడ్డిగారు, రాజాప్రతాపగిర్జిగారు, బలవంతరెడ్డిగారు, కాళ్లూరి రాజేశ్వరరావుగారు, తుంగతుర్తి నరసింహారావుగారు, మాదిరాజు వేంకటేశ్వరరావుగారు, రాజగోపాలరెడ్డిగారు, మాడపాటి హనుమంతరావుగారు, మారేమండ నరసింగరావుగారు,

రాజాబహద్దరు పిళ్లైగారు, నాగబండికట్ల మల్లయ్యగారు, వైద్య భూషణ జనార్దనస్వామిగారు, కుంటల్లి రామారావుగారు, సదాశివరెడ్డిగారు మాకు ధనసహాయము చేసియున్నారు. కావున వారిని కృతజ్ఞతా పూర్వకముగ స్మరించుచున్నాము.

విజయనగర సామ్రాజ్యపు కడపటి చక్రవర్తియగు రామరాయల పటము ఒక పారసీపుస్తకములో నున్నదనియు, అది పూనాలోని భారత ఇతిహాస సంశోధక మండలివారి గ్రంథాలయములో నున్నదనియు తెలిసెను కావున మా మండలి కోరికపయి పూర్వము న్యాయమూర్తులుగా నుండి కీర్తిశేషులయిన పండిత కేశవరావుగారు జయకరుసాయల ధరావతుపయి ఆ పారసీగ్రంథమును మాకు తెప్పించియిచ్చిరి. ఈ పుస్తకము సచిత్రమై, పద్యాత్మకమయిన చిన్న గ్రంథము. ఇందు రంగులతో మహమ్మదీయ నవాబుల పటములును, "రామరాజు యుద్ధమునకు వెడలుట" అను పటములు గలవు. నవాబుల రూపసాదృశ్యములు సరిగానున్నందున రామరాయల పటముగూడ సరియైనదని భావించి దానికి రు. ౫౭-౦-౦ లు వెచ్చించి, విపులపటమును రంగులతో ప్రతి తీయించినాము. (౭-౫-౧౩౨౮ ఫ.) ఈ పటమిప్పుడు శ్రీకృష్ణరాయాంధ్ర భాషానిలయ కుడ్యముల నలంకరించుచున్నది.

మద్రాసు హైకోర్టుప్రధానన్యాయాధీశులగు సర్. వేపా

రామేశం పంతులు బి.ఏ.బి ఎల్,గారును. మదార్సు ఆర్ష శాఖాధ్యక్షులగు సి. ఆర్. కృష్ణమాచార్యులుగారును, చిలుకూరివీరభద్రరావుగారును,డాక్టరు మారేమండ రామారావు ఎం.ఏ.పి. ఎచ్.డి. గారును,మల్లంపల్లిసోమశేఖరశర్మగారును,హైదరాబాదుఆర్ష శాఖాధ్యక్షులగుమిస్టరు గులాంయజ్దానీగారును ప్రశంసించియున్నారు. చేసినది యల్పము; చేయవలసినది మిక్కుటము. మాయీ యుద్యమము నిరంతరాయముగ సాగుటకయి చరిత్రాభిమానుల యౌదార్యమును అభిలషించుచున్నాము. ఇప్పుడు మాకు గల ధనసంపద పూజ్యము. మరి ముందీ పరిశోధకరథము నడుచుటెట్లు? పదిమంది బుజాలు వేయవలదా?

౨౭-౧-౧౯౪౯.

ఆదిరాజు వీరభద్రరావు
కార్యదర్శి.



# ఆంధ్ర చంద్రికా గ్రంథమాల

## నియమములు

౧. ఈ గ్రంథమాలలో దేశచరిత్రలు, మహా పురుషుల జీవితములు, ప్రకృతి శాస్త్రములు, ఇతర విజ్ఞానాత్మక గ్రంథములు ప్రకటింప బడును.

౨. ఈ గ్రంథములన్నియు ప్రజా సాహిత్య సంబంధములుగా నుండి, సులభమైన వచన శైలిలో ఆకర్షణీయముగా ప్రకటింపబడును.

3. గ్రంథములు పెద్దవిగా నుండక, వీలైనంత వరకు పరిమితమైన పుటలు కలిగి, అందరు కొనుటకు అందుబాటులో నుండులాగున ప్రకటింపబడును.

౪. ఈ గ్రంథమాలకు చందా లేదు. మాసపత్రిక కాదు. గ్రంథము తయారు కాగానే చందాదారులకు వి. పి. గా పంపబడును.

౫. మా గ్రంథమాల ప్రచురణము లన్నియు గొనుటకు నొప్పుకొనువారు "శాశ్వతపు చందాదారు" లనబడుదురు.

౬. శాశ్వతపు చందాదారులు కాగోరువారు, తమ యామోదమును లిఖిత పూర్వకముగా తెలిపి ఒకరూపాయి ప్రవేశరుసుముగా చెల్లించవలెను.

౭. శాశ్వతపు చందాదారులకు మా గ్రంథమాల పుస్తకముల వెలలో నాల్గవభాగము తగ్గించి గ్రంథములు తయారు కాగానే వి. పి. గా పంపబడును. పోస్టుకర్చులు చందాదారులే భరించవలయును.

౮. ఇంతవరకు ఆంధ్ర వాఙ్మయములో లేని గ్రంథములే ఇందు ప్రకటింపబడును. ఈ గ్రంథములలో విషయవర్ణనకు సంబంధించిన పటములు, గ్రంథకర్తల పటములు ఉండును.
౯. ఆంధ్రభాషకు పుష్టి కలిగించుటయు, ఆంధ్రులలో విజ్ఞాన చంద్రికలను ప్రసరింపజేయుటయు మా యుద్దేశము. డబ్బు సేకరింపవలెనని మా యుద్దేశము కాదు.
౧౦. ఆంధ్ర భాషాభిమానులందరును గ్రంథమాలకు శాశ్వతపు చందాదారులుగా చేరి, మా భాషా వ్యవసాయమునకు ప్రోత్సాహ మొసంగి, ఆంధ్ర సరస్వతీదేవి ఆరాధనమునందు పాల్గొని కృతకృత్యులు గావలయునని మా విజ్ఞాపన.

## ఇదివరకు ప్రకటింపబడిన గ్రంథములు

### ౧. విస్మృత సామ్రాజ్యములు.

ఇదియొక చరిత్రగ్రంథము. నవలవలె మనోరంజకము నందు కథాంశములతో నొప్పారుచున్నది. ఇందు కాల్డియ బాబిలోనియా, అస్సీరియా యను ప్రాచీన సామ్రాజ్యముల చరిత్ర వర్ణింపబడినది,

ఈ సామ్రాజ్యములు నాలుగయిదు వేల సంవత్సరము క్రిందట మిగుల వైభవదశలోనుండి కాలపురుషుని ప్రభావము మాటుపడిపోయినవి. చరిత్రకారుల అవిశ్రాంత పరిశోధన ఫల ముగా వీటి అద్భుతకథనము బయటపడినది. ఇంగ్లీషులో పెక్కు ఉద్గ్రంథములను పరిశీలించి, ఈ సామ్రాజ్యముల త, శిల్పసంపద, మత విశ్వాసములు, ఆచారములు, విజ్ఞా

శౌర్యపరాక్రమములు మున్నగు పెక్కువిషయములను గూర్చి మనోహరముగా, అందరకర్థమగునట్లు ఈ గ్రంథము రచింపబడినది. ఆ కాలపు కళలు, దేవతలు మొదలగువానిని దెలుపు పటములు మంచి ఆర్టుపేపరుమీద ముద్రింపబడినవి కలవు. ప్రారంభమున ప్రాచీనమానవుడు నాగరికత శిఖరారోహణమునకు ఎట్లు ప్రయత్నముచేసెనో చక్కగా వర్ణింపబడినది.

గ్రంథకర్త : శ్రీ ఖండవల్లి బాలేందు శేఖరం, ఎం. ఏ. గారు.

పుటలు ౨౬౦. వెల చందాదారులకు రు ౨-౦-౦

ఇతరులకు. రు ౨-౧౨-౦

## ౨. తెలంగాణా ఆంధ్రోద్యమము

(మొదటిభాగము)

ఆంధ్రచంద్రికా గ్రంథమాలలో నిది రెండవకుసుమము. ఇది తెలంగాణములోని ఆంధ్రోద్యమమునకు సంబంధించిన చరిత్రగ్రంథము. ఇచ్చటి ఆంధ్రులు తాము ఆంధ్రులమను సంగతి నెరుంగక, సాంఘికముగ, రాజకీయముగ, భాషా విషయికముగ, వెనుకబడియున్న తరుణమున వారిని మేల్కొల్పిన పవిత్రోద్యమ చరిత్రమిది ఈ ఉద్యమ ప్రభావమున ఆంధ్రులకు రాజకీయముగ అస్తిత్వము లభించినది. ఆంధ్రభాషకు ప్రచండ ప్రోత్సాహము కలిగినది. ఆంధ్రసంఘమునకు గట్టి కట్టుదిట్టములేర్పడినవి. ఇప్పటి వివిధోద్యమములయందు ఆంధ్రులు చూపుచున్న చైతన్యమునకు బీజములునాటి దోహదము కావించినదీ ఆంధ్రోద్యమమే.

ఈ ఆంధ్రోద్యమ రథమునకు బుజాలువేసిన మహనీయులకృషి చక్కగా వర్ణింపబడినది. వారిపటములును ముద్రింపబడినవి. అతిశయోక్తులులేకుండ, యథార్థ విషయములు మాత్రమే సప్రమాణములుగా వ్రాయబడినవి. ఈ గ్రంథము ఆంధ్రులందరు చదివితీరవలయును.

గ్రంథకర్త : శ్రీ మాడపాటి హనుమంతరావుగారు.

పుటలు ౧౫౨. వెల చందాదారులకు రు ౧-౮-౦

ఇతరులకు ౨-౦-౦

## 3. ఆంధ్రసాహిత్య చరిత్ర సంగ్రహము

(మొదటి భాగము)

అతి పురాతన కాలమునుండి క్రీ. శ. ౧౮౦౦ వరకు మన మాతృభాషయగు నాంధ్రమున, సాహిత్యము పొందిన వివిధ దశలు ఈ గ్రంథమున చక్కగ విశదీకరింపబడినవి. ఏతద్గ్రంథ ప్రత్యేకత్వము, ఏతద్గ్రంథకర్త ప్రతిభ ఆంధ్రలోక ప్రశంసను పొందదగియున్నవి. ఇందభివర్ణితములైన కళాక్షేత్రముల ప్రశంస, వచనవాఙ్మయ విన్యాసము, తెలంగాణకవుల యుదంతము, ఆంధ్రకవయిత్రుల ముచ్చట, చారిత్రక కావ్యముల ధోరణి, యక్షగానముల సంవిధానము, శతకవాఙ్మయపు రీతులు, గేయవాఙ్మయ సౌందర్యము, ఇత్యాది ప్రకరణములు ఆంధ్రవాఙ్మయముయొక్క వైశాల్యమును, శాఖలను, అభిరుచు

లను, గాంభీర్యమును, శోభను ప్రకాశమానము గావించుటకు ఎంతయు తోడ్పడుచున్నవి. శైలి మృదుమధురముగ, ఇంపై యలరారుచున్నది. ఆంధ్రజనులు ఇందలి సాహిత్య చరిత్రామృతమును గ్రోలి యానందింతురుగాక!

గ్రంథకర్త : ఆచార్య, ఖండవల్లి లక్ష్మీరంజనము, ఎం.ఏ. గారు.

పుటలు ౩౭౫. వెల చందాదారులకు రు ౨-౮-౦
ఇతరులకు రు ౩-౦-౦

శాశ్వతపు సభ్యుల దరఖాస్తుఫారము.

# ఆంధ్రచంద్రికా గ్రంథమాల

మ. రా. శ్రీ కార్యదర్శిగారు; హైదరాబాదు.

నేను మీ గ్రంథమాలలో ప్రచురింపబడు గ్రంథము[illegible] నన్నిటిని కొనుట కంగీకరించుచు చందాదారుడనుగా [illegible] చెల్లించుచున్నాను. నాకుపుస్తకములు అందజేయుచుండగలరు.

పేరు ... ... ... ...

చిరునామా ... ... ... ...

(టప్పా) ... ... ... ...

తేది ... ... జిల్లా ... ... ...

## రాబోవు గ్రంథములు.

(౧) వైజ్ఞానికుల జీవితములు :

గ్రంథకర్త : బి. వి. రమణారావుగారు, ఎం. ఎస్సి.

(౨) రాజకీయ పరిజ్ఞానము :

గ్రంథకర్త : డాక్టరు, మారేమండ రామారావుగారు, ఎం. ఏ., పి. ఎచ్. డి

(3) పౌరధర్మములు :

గ్రంథకర్త : డాక్టరు, రాంపల్లి విశ్వేశ్వరరావుగారు, ఎం. ఏ., బి. టి., పి ఎచ్. డి.

(౪) మాదవమంత్రి :

గ్రంథకర్త : భూపాలరావుగారు, ఎం. ఏ,

(౫) తెలంగాణా ఆంధ్రోద్యమము (రెండవభాగము) :

గ్రంథకర్త : మాడపాటి హనుమంతరావుగారు.

(౬) రోమక సామ్రాజ్యచరిత్ర :

గ్రంథకర్త : నూకల నరోత్తమరెడ్డిగారు, ఎం. ఏ.

ఆంధ్రసాహిత్య చరిత్ర (రెండవభాగము) :

గ్రంథకర్త : ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు ఎం. ఏ.

"ఆంధ్రకుటీరము,"<br>
సుల్తాన్ బజారు,<br>
హైద్రాబాదు-దక్కన్<br>
౧౫-౧౧-౧౯౪౯.

మేనేజరు,<br>
ఆంధ్ర చంద్రికా గ్రంథమాల.